





AMRUTAN
The
Pain Ba
Amrutanjan
BOMBAY
CDL 28

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 49
సంచిక 12
23.11-55

మన్మథ కార్తిక శుద్ధ అష్టమి బుధవారం



తామరతంపర

ఫోటో. పినపాల మధు—బందరు.

ముఖచిత్రం: హిందీనటి శ్యామ.

విషయానుక్రమణిక

# ఈ ఆశ్చర్యకరమైన రాత్రి పగలు చర్మ రక్షణ సాధనతో
# మీ చర్మమును సొగసుగ మరియు మనోహరముగ ఉంచుకోండి

విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీములు మీ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగ, అందముగ ఉంచును.



**చర్మమును మృదువుగ, నిర్మలముగ చేయుటకు రాత్రి వాడే క్రీము**

మీరు పండుకునేముందు విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ వాడండి. అది కొన్ని సెకండ్లలోనే మీ చర్మమునకు కావలసిన సహజమైన నూనెలు మరియు తేమ లోపములను పూర్తిచేసి యధాస్థితికి తెచ్చుటయే కాక దానిని లేతగా మరియు మనోహరముగా ఉంచుటలో సహకరించును.

పాండ్స్ కోల్డ్ క్రీమ్ అద్భుతముగ చర్మమును శుభ్రపరచును. రోమ రంధ్రములు పెద్దవి కాకుండా రక్షణనిచ్చి మీ చర్మమును బహు నిర్మలముగ, నిష్కళంకముగ ఉంచును.








**చర్మమును కాపాడుటకు మరియు సుందరముగ చేయుటకు పగలు వాడే క్రీము**

తేలికగ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పైపైన ముఖమునకు రాసుకుంటే పగటివేళ మీ అందమును అధికము చేస్తుంది. మనోహరము, నిష్కళంకమైన చర్మమును పాడుచేయు దుమ్ము, సూర్యరశ్మి మరియు వడగాడ్పుల నుండి యిది మీ చర్మమునకు సౌమ్యరక్షణ నిచ్చును. మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ మరి జిడ్డుగా ఉండే చర్మమునకు ఒక అద్భుతమైన సాధనము—దీనితో రోమ రంధ్రములను అర్థి కళంకము కలిగించే అధికమైన నూనెలు లేకుండా చేయవచ్చును.

ప్రతిచోట అందమైన స్త్రీలు వారి సౌందర్య రక్షణకు ఈ రెండు క్రీములనే వాడుతున్నారు. మీరూ వారివలె పాండ్స్ కోల్డ్ క్రీమ్ రాత్రి మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పగలు వాడండి. త్వరలోనే వికసించిన పుష్పమువలెనున్న మీ ముఖమును చూసుకొని మీరు చకితులౌతారు.

## పాండ్స్
కోల్డ్ క్రీమ్
వేనిషింగ్ క్రీమ్

విశ్వసంస్కృత పరిషత్ చతుర్థ మహాసభసందర్భంలో నెల 11న ఈ పరిషన్మండలి సమావేశం తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ మందిరంలో జరిగింది. పరిషదధ్యక్షుడు శ్రీ కె. ఎం. మున్షీ, హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు, ఆంధ్ర రెవిన్యూ మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి ప్రభృతులు, శ్రీ మున్షీ వెనుక కుర్చీలో కూర్చున్నవారు శ్రీ కాశీ కృష్ణాచార్యులు.



మహాసభకు రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ రాగానే, ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆగమశాస్త్రాధ్యాపకులు శ్రీ కె. శ్రీనివాసాచారి, తిరుపతి దేవస్థానం ఆస్థానపండితుడు, శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులు, ఎదురేగి, ఆయనకు పూర్ణకుంభంతో స్వాగతమిచ్చారు.

# చింత

వేళాకోళం చేయడం మనకు వెన్నతో పెట్టినవిద్య. "చింతకాయలేరా!" అని చింతాకంతైనా ఆలోచించకుండా ఎదుటివాడిమాటను ఎగతాళిపాలుచేసి చిన్నతనం ఆపాదించడం మనకు చిన్నప్పటినుండీ అలవాటు. అయితే, ఆ చిన్నతనానికి ఉదాహరణగా పేర్కొనబడేచింతకాయ మాత్రం మనమనుకొనేటంత చిన్న వస్తువు కాదు. చింతించిచూస్తే దానితాలూకు వింతలు విశేషాలు బోలెడన్ని బోధపడి అంతతోబాటు మన అజ్ఞానముకూడా బయటపడుతుంది.

మానవులు పచ్చిమాంసం తినడం మాని ఆహారం పచనం చేసుకోవడం ప్రారంభించి, క్రమేపీ అందులో అనుభవం గడించి, వారి వారి యిష్టాయిష్టాలు, తెలివితేటలకొద్దీ రసనలకింపితంగా రకరకాల వంటలు వండి భోజనాలు మొదలుపెట్టేసరికి "జిహ్వకొక రుచి, పుర్రెకొక బుద్ధి"గా పరిణమించింది పరిస్థితి. "లోకోభిన్నరుచిః" అన్న లోకోక్తి కూడా ఆ సందర్భంలోనే అవతరించింది.



అటువంటి సందిగ్ధసమయంలో అన్నిరుచుల వస్తువులను తిని జీర్ణించుకోగలిగిన అనుభవజ్ఞులు కొందరు విస్తళ్ళముందునుండి లేచి వీధి అరుగులమీద కూర్చుండి, తిన్న వస్తువులు, తిన్నెలుకూడా అరిగిపోయేదాక తీరికగా దినాలతరబడి దీర్ఘచర్చలు చేసి, తమ తమ అనుభవాలను అవలోడనగావించి, విభిన్న రుచులనుగూర్చి విమర్శించి, అన్ని రుచులకు మూలం ఆరే రుచులని, అందులోనూ ముచ్చటగా మూడేరుచులు ముఖ్యమని సిద్ధాంతీకరించి, భిన్నత్వంలో ఏకత్వం సాధించి, వివిధరీతులుగా విలసిల్లే పాకకళను శాసించి పాకశాసనులై, ఆ అతిభోజనులు కీర్తిభాజనులైనారు.

## "చదలవాడ"

ఆవిధంగా వారు ముక్తాయించిన మూడే రుచులలో ఒకటైన పులుపు యావత్ప్రజానీకం అవసరాలకు సరిపోయేటంత ఎక్కువగా ఎక్కడినుండి లభ్యం అవుతుందా అని పూర్వీకులు పుణ్యార్జనచింత మాని తమ వెనుకటి తరాలవారమైన మనం వెతికవలసిన చింత లేకుండుటకుగాను ప్రతిచెట్టూ, ప్రతి పుట్టా పరిశీలించి చూడగా, వారి చింతకు ఫలంగా కనిపించిందే చింతచెట్టు. వారుపడ్డ చింతను తరతరాలవారు తలుచుకోవలెననే ఉద్దేశ్యంతోనే దానికా పేరు పెట్టినారు. ఆ చింతచెట్టు వారి పరీక్షలకు నెగ్గి "చింత చచ్చినా పులుపు చావదు" అని వారిచేత ప్రశంసలుపొందింది. అందువల్ల దానికి విపరీతమైన ప్రాధాన్యం ఏర్పడిపోయి, దాని ప్రభావం మనలో వేరు దన్నుకుపోవడంకాక, అది కాస్త ఎక్కువైతే మనం పరస్పరం "పులుసు వంగడిసుకోవడం"దాక వచ్చింది. అరబ్బుభాషలో టామర్ అంటే ఖర్జూరం. చింతపండుకు వారు "టామర్-ఇండ్" (అంటే ఇండియా ఖర్జూరం) అంటారు. అదే ఆంగ్లంలో Tamarind అయింది. కాబట్టి పైన వివరించినట్లు మొట్టమొదట చింతచెట్టును కనిపెట్టినది మనవారే అని ధైర్యంగా చెప్పవచ్చును.

చిల్లిపాత్రకు అర్థం పెట్టుకోవడం మొదలుకొని చింతపండును చిత్రవిచిత్రంగా వాడుకొంటుంది గృహలక్ష్మి. చింతపండు లేకుంటే వంట చిన్నబోతుంది. చారూ పులుసుల్లో చింతపండు నీళ్లు చేర్చకుంటే నాలుకకు రుచించకపోవడం కాక నలుగురికీ వడ్డించడానికిన్నీ చాలదు. పరిమితమైన సంపాదనతో అపరిమితమైన బాధ్యతలతో సతమతమయ్యే మధ్యతరగతి మానవుడు ప్రతిరోజూ ఆస్వాదించగలిగిన Fruit Juice కూడా ఈ చింతపండు నీరైన పులుసూ చారే. ఔత్తరాహులు మన చారును "చించ్ పానీ" అని చిన్నతనంగా అంటారే గాని దాని రుచి వారికి తెలిస్తే మనలాగ దొన్నెలతోకాక దోసిళ్ళతోనే త్రాగగలరు. పచ్చిపులుసులోని ప్రధానాంశం చింతపండు. తత్సమానమైనటువంటిది "పులికాచ్చల్" ఇది తమిళుల వంటకు. చింతపండు నీళ్ళను ముద్దగా చిముడబెట్టడంకాక అందులో ముడిమిరపకాయలు, వేరుశెనగవిత్తులు, శెనగపప్పులు, ఎక్కువ నూనెలో వేగించి పోపుపెట్టి తయారుచేస్తారు ఆ పులికాచ్చల్. అందుచేత అది దినాలతరబడి చెడిపోకుండా దివ్యంగా వుంటుంది. దానితోనే వారు "పులియం శాదం" అనగా చింతపండు పులుసన్నం కూడా కలుపుతారు. దాన్నే వైష్ణవులు "పులిహోర" అంటారు. "పొరుగింటి పుల్లకూర" లోని పులుపుకు కూడా చింతపండే కారణం. దురద వస్తువులు, చేమకూరలను ప్రప్రథమంగా చింతపండులో ఉడికిస్తేనే వానికి పచనయోగ్యత సిద్ధించి, ఆ తర్వాత ఆహారయోగ్యత కలుగుతుంది. అటువంటి వస్తువుల్లో ఒకటైన చేమకూర వండడం చేతగాని ఇల్లాలికి కవీశ్వరుడైన భర్త, "చేమకూర తెచ్చి సన్నగా తరిగించి - చింతపండు వేసి చిముడబెట్టి - బంతివారికెల్ల బాగుగా వడ్డించి - నాకు పెట్టవమ్మ నంగనాచి." అని చేమకు దురదతీరే విధానం చెప్పి తన కవిత్వం దురదకూడా తీర్చుకున్నాడు. చింతపండు, ఆవాలు, ఉప్పు చేర్చి నల్లేరు పచ్చడి నూరకున్న వారిని వంసన్నుత పండితుడు భార్యతో,

"మత్కుణా నది సంయుక్తం, గోపత్నీ సింధు సంయుతం - దుఃఖాఖ్య ఖలయుక్తంచ, గ్రామమార్జం కురుష్వమే." అని మర్మంగా అనగా, ఖర్మంచాలక విన్న ప్రత్యర్థిపండితుడు పరారి చిత్తగించినాడు. అంతటితో సభలో వాదం తప్పడంగాక సంస్కృత పండితునికి సన్మానం కూడా చిక్కింది. పచ్చడం సంపాదించుకొన్న పండితుడు, ఇంటికొచ్చి, అన్నంముందు కూర్చుని పచ్చడి నోట్లో పెట్టుకొనేసరికి మిరపకాయ మినహాయించింది. కారణం అడిగేసరికి "మీ కవిత్వంలో కారంలేదు. కావలిస్తే మరోసారి శ్లోకం మననంచేసి చూసుకో"మంది, ఆయన సతీమణి. నిజమే తనశ్లోకంలో రసలోపం జరిగినమాట వాస్తవమే. సతీమణిచేసిన అవమానానికి, సభికులు చేసిన సన్మానాన్ని సరిపెట్టుకొని చల్లగా ఊరుకున్నాడు సంస్కృత పండితుడు. వేమన "భాండశుద్ధిలేని పాకమేల" అన్నాడుకాబట్టి భామామణులు పాకసిద్ధికే గాక భాండశుద్ధికికూడా చింతపండే విరివిగా వాడుతారు. బాణట్లోనూనె పొంగిపోకుండా విరుగుడుగా చింతపండు వుంట చేసి వేస్తారు. ఈ చిట్కా తెలియనివారు చీకాకుపడతారు.

పాత చింతకాయ తొక్కు బాలింత పథ్యానికి కూడా పనికివస్తుంది. పచ్చి చింతకాయ కూడా పచ్చడికి పనికివస్తుందిగాని, పడిశం పడుతుంది. అందుకే ఒకకవి "శ్లేష్మంబునకు బంటు చింతకాయ" అని కూడా అన్నాడు. చింతకాయనుగురించే "ఆకాశాన అరవై కోడవండ్లు" అన్న పొడుపుకథ కూడా పుట్టింది "దప్పట్లకు చింతకాయలు రాలవు" అనేసామెత అందరికీ పరిచితమే. మామూలు చింతకాయ కాక "సీమచింతకాయ" కూడా వుంది.

చింతచిగురు పుల్లకూరకు పనికొస్తుంది. "చింతచిగురు పప్పు" రుచి చిన్న చిన్న మాటలతో చెప్పితే అర్థంకాదు. "చింతకు చిగురు అందము. పిల్లకు పొగరు అందం" అని కూడా అనుభవజ్ఞులు అంటారు. చింతాకు ఎండించిదంచి, ఉప్పుకారంచేర్చి "చింతాకు పొడి" తయారుచేసి అన్నంలో పొడివలె వాడుకొంటారు. "చింతాకు పతకం" అనేది పూర్వకాలంనాటి నగ. "సీతకు చేయిస్తి చింతాకు పతకము. పతకమునకు బట్టె పది వేల వరహాలు" అనే పాటనుబట్టి చింతాకు పతకం విలువ ఎంతో తెలుస్తుంది. కొలువ ఒడ్డుల్లో "పులి చింతాకు" అనే ఒక రకం ఆకు చిక్కుతుంది. అది కూడా పుల్లగా వుండి పచ్చడికి పనికొస్తుంది. అరోచకానికి ఆ పచ్చడి మంచిది.

చింతగింజలను నానించి ఉడకబెట్టి కొందరు తింటారు. అందులో రుచి లేదని మరి కొందరు అభిప్రాయ పడతారు. ఆ కోవకు చెందినవారే "అరవ ముత్తుకోళ్లు—చింత గుగ్గిళ్ళు" అని ఎగతాళి చేస్తారు. కాని ఎవరి మాతృభాష వారికి తీపి అన్న సత్యం గుర్తించినవారు ఆ మాట పట్టించుకోరు. ఇటీవల చింత గింజలమీద చిత్రమైన పరిశోధనలు జరిగినవి. తత్ఫలితంగా శాస్త్రజ్ఞులు దానికిగల చాలా ప్రయోజనాలను కనుగొన్నారు. ప్లాస్టిక్, చేనేత, అద్దకం, బంక పరిశ్రమల్లో చింతగింజకు చాలా ఉపయోగం వుందని తేలింది. చింత గింజలతో ఆడే "వామన గుంటలు" ఒక చక్కని Indoor Game. ఆ వామన గుంటల పేరు మీదుగా మహిళా సాహిత్యం కూడా మన భాషలో వుంది పల్లెటూరి బళ్ళలో చింత గింజలతోనే గణితం నేర్పుతారు. "చింత గింజ తస్తే ముణగని" పాలే చిక్కని పాలని మన పెద్దలు లాక్టొమీటరు (క్షీరమాని) లేకనే ఆ రోజుల్లో నిర్ధారణ చేశారు. లేహ్యాలు "చింతగింజ ప్రమాణం" పుచ్చుకోమంటారు వైద్యులు. అటువంటి చింతగింజను గురిగింజలవలె మనం వెక్కిరించడం మన గ్రుడ్డితనానికే నిదర్శనం.

నల్లగావుండేవారిని "పాత చింతపండు" అని వెక్కిరిస్తాము. కాని పాతచింతపండు పథ్యానికి ప్రసిద్ధి. కొందరు కాల్చిన చింతపండు వాడమంటారు పథ్యానికి. పూజా విగ్రహాలకు చింతపండుతో "పులికాపు" చేస్తారు. (అనగా తోమి శుభ్రపరుస్తారు) చింతకట్టెలు, బొగ్గుతాలూకు నిప్పు కణకణలాడుతూ యెక్కువ వుష్ణం కలిగిస్తుంది. "కండ్లు చింతనిప్పులవలె నున్నవి" అనడం కూడా ఆ కారణంచేతనే. ఉగాది పచ్చడిలో కొత్తచింతపండు కొని తెచ్చైనా చేర్చకుంటే తృప్తికలుగదు మనకు.

ఊళ్ళవిషయం తీసుకుంటే "పూరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి, మాగచింత పల్లె మొదటియిల్లు" అనే వేమనపద్యంలోని "మాగచింతపల్లె కాక, రెండు చింతల, చింతలవలస మొదలైన పేర్లువినిపిస్తూవుంటవి. పూనా సమీపంలో "చించ్ వాడ్" అనే గ్రామంవుంది. ఆ పల్లెకు చెందినవారు తమ పేళ్లకు "చించ్ వాడ్ కర్" అని యింటి పేరులాగా తగిలించుకుంటారు. మద్రాసులోని ఒక పేటకు "చింతాద్రి పేట" అని పేరు. మరొక ప్రాంతానికి "పులియాంతోపు" అనిపేరు. "చింతా వారు" అనే యింటిపేరున్నూ మనకు చిరపరిచితమే.

బాగాపండిన చింతపండు ఏరీతిగా పెరడుకు అంటుకోకుండా లోపలనే విచిత్రంగా విడిపోతుందో, అదేరీతిగా మానవుడున్నూ ఆంతరంగికంగా పరిపక్వం చెందేకొద్దీ, తన్ను ఆవరించుకొన్న ప్రాపంచిక చింతలను అంటించుకోవడం క్రమముగా మానేస్తాడు. ఆ పరిపక్వత రావలెనంటే ఆ చింతలోనుండే కలగాలి. అదే ఆత్మవిచారం. చింతపండులోయిమిడిన వేదాంత రహస్యంకూడా అదే. అందుకే,

"ఏ చింతలు వద్దయ్యా
నా చింతలుకూడవద్దు ననుగన్నయ్యా!
నీ చింత నిలుపు నామది
వే చింతలు పడగలేను వెంకటరమణా"

అంటూ ఏడుకొండలవాడిని తలవడం ఎంతైనా మంచిది. ★

# ఎండ పూవులు 



## కందుకూరి లింగరాజు

ప్రొద్దుటనుండి ఆఫీసులో కొట్టుకు చని, చికాకుతో ఇంటికి వచ్చేసరికి ఇల్లు తాళంవేసి వుండడంతో, పట్టరాని కోపం వచ్చింది యాజులుకు. పైగా అలసిపోయి, డస్సి, కాళ్లుచేతులుడిగి, తలదిమ్ముతో వస్తాడని వూహించుకోక, ఇష్టం వచ్చినట్లు స్నేహితులు, క్లబ్బులు, స్త్రీ సమాజాలకు హాజరవ్వడంకు తు, చా తప్పకుండా వుండే ఈ శారద చర్య వళ్లు ఉడకపెట్టింది.

నెలరోజుల్లోనూ, ఇలా ఇళ్ళకు తాళం వుండడం, తనకు కనీసం నడుం వాల్చడానికైనా స్థలం లేకపోవడం జరుగుతూనే వుంటుంది ముప్పాతికరోజుల్లో. పిడికిళ్లు బిగపెట్టుకుని, ఘట్టిగా తినాలని అనుకుంటూనే, కాఫీహోటలుకు వెళ్ళి నైవేద్యం స్వాహాచేసి వచ్చేశాడు.

ఆరోజు అలాగే వచ్చి, అరుగుమీద కూలబడ్డాడు. ఇద్దరు ముగ్గురు పలకరించేరు. ఓసారి తనస్థితి, మరోసారి గుమ్మానికితాళం చూచి నవ్వేసివెళ్లేరు. సిగ్గుపడ్డాడు. తను ఎంత తక్కువ మాపులో వుండిపోవలసి వొచ్చిందో అని. పైగా ఆఫీసరు "నువ్వు పనిసరిగ్గా చెయ్యటంలేదు...ఇలా అయితే" మండిపడడం, మరింత దిగతీసింది.

ఆలోచిస్తే, నిజంగా ఆ ఆఫీసులో తనే మొట్టమొదట, ఆ విధానంకు పునాది వేసి, పెంచి, పెద్దచేసి, ఉన్నతుల్లో రెండు మెట్లుయెక్కి, నలుగురు వెళ్ళిపోయిన ఆఫీసర్లచేత 'సభాష్' అనిపించుకున్నాడు. అలాంటప్పుడు క్రిందివాళ్ళని మానవులుగా చూడని ఈ వ్యక్తి భావనే అర్థంకావటం లేదు. తీరా తను చేసినతప్పు ఏమిటి అన్నా కన్పడదు.

సందు మలుపునగ్గర ఉరుకు లురుకు కుంటూ వస్తోంది శారద. చూపుమేరకు వచ్చేసరికి నవ్వింది చామంతి పువ్వుల్లోంచి రేకులు విచ్చుకున్నట్లు, పుచ్చపువ్వులా వెలుగుతూ ...

కోటు పుచ్చుకుంది. "త్వరగా మీరు రాకుండా వచ్చెయ్యాలనుకున్నాను మా మేష్టరు యింటికి తీసుకువెళ్ళింది. టీ వగైరాలిచ్చింది. అలస్యం అయిపోతూనే వుంది. మాసాబ్ కు కోపం వస్తుంది" అని అన్నాకూడా వదల్లేదు..."

ఓసారి కనుకొలుకుల్లోంచి చూచింది శారద చలించలేదు యాజులు.

"కాఫీడికాక్షన్ వేసేసొట్టేను. కుంపటి అంటించడం వేడిచేసి ఇచ్చేస్తా"

అప్పటికీ మాట్లాడలేదు. నోరు విప్పాలన్న కోర్కెవున్నా ఏవిధంగా మొదలుపెట్టాలో అన్నది గజిబిజిగావుంటే ఉడికిపోతున్న అన్నం మెతుకే అయ్యేడు. ఇన్నాళ్లూ దానికోసం చేసిన త్యాగంఅంతా ఎత్తిపొడిచింది. తను ఆఖరుకు నిలువు దోపిడీ అవబడ్డా, ఈవణ్మాత్రం అయినా కృతజ్ఞతలేకుండానే, అది సంచరించటంతో త్యాగంచెయ్యడం అన్నది అసలు జీవితంలో ఎంతఓటిపదమో అనిపించింది.

ఆరోజు... ఏడుసంవత్సరాలవెనుక...ఈ ఇంటిగుమ్మంలో కాలెట్టింది. అప్పుడు ఇల్లువిధాల్లో అభివృద్ధికోసం సంపాదనంతా దానిచేతుల్లో పెట్టేడు. దీపపువెల్తురు క్రమ్ముకున్నట్లు చీకట్లన్నీ శూన్యంలోంచి మాయమైపోయి పరిసరాల్లో నిండుకున్నాయి. అవన్నీ మెరపిన్నీ పోయేయి. ఆఖరుకు చోటులేకుండా, అంతస్తుల్లా పేరుకున్నాయి.

తర్వాత కాలంలోవచ్చిన అనుయాయులందరూకూడా ఆశ్చర్యపోయేరు 'ఇవన్నీ మేంకొన్నవే... మా జీతంలో' అని అది చెప్తుంటే సర్కారువారు ఉద్యోగాల్లో అంతస్తులిచ్చినట్లయ్యేది.

చాలాసార్లు అనుకున్నాడు. ఈనాటి ఉన్నతికంతా తనా అదా కారణం అన్న మీమాంసా కల్గింది. "అల్లుడుగారు చాలా జాగ్రత్తివంతులు. ఆయనకు ఇంట్లో ఏంవేం కావాలో తెలుసు..." అ వరసలో అత్తగారు అనడంతో శరీరంమీద దుశ్శాలువులు కప్పుకున్నట్లు అయ్యింది.

తనెంత త్యాగం ... ఖర్చులు తగ్గించుకుని, పెట్టిన తిండిని తిని, చిరిగిన బట్టలు కట్టుకొని..ఒక్క కోటుతోటే గడిపిచేసేడు. చేస్తున్నాడుకూడాను. అది పదిమందినోటమ్మట విన్నప్పటినుండి...తనకోసం, తనసుఖం, ఏక్షణాన్కి ఏమికావాలో అన్న చింతన, దానిని సమకూర్చడానికి ఆయత్తత ఎందుకు చెయ్యమూ అన్నకోపం, ద్వేషం, చెయ్యవలసి వుంటుంది అన్న ఆశ చిమ్ముకునేది.

చాలాసార్లు, ఏదో, ఎవరో వచ్చినప్పుడు వస్తు ప్రదర్శనాలివ్వడం "మాకూ చాలా కాలంనుండి అల్లాంటి ఫిల్టరు కొనుక్కోవాలని, ఇల్లాంటి ఇడ్లీల పాత్ర కొనుక్కోవాలని, చిన్న కోరంకోసం బజారంతా మొన్న తిరిగాం, ఎక్కడ కొన్నారని" అండంతో 'ఆయనా' నేను వెళ్లే కొన్నాం అండీ!" అది అనడం, వాళ్లు "మీ ఆయనకు ఎంత ఓపిక ... మావారైతే కన్నూ బున్నూ కుంటారు" ఇల్లాంటివల్ల, మంత్రాలే అయితే, స్వతాగ చింత కాయలు రాలినట్లే, వుండేది. దాంతో వంటింట్లో గిన్నెలమీదనుండి, కుర్చీలు, బల్లలమీదుగా తన త్యాగంకు ఆందోళికం పట్టేసేడు; వీళ్లందరు బోయులైతే.

ఇన్ని జరిగినా, అదిమాత్రం చస్తే, తన



స్కాట్లాండులోని హావిక్ ఉన్ని ఫ్యాక్టరీలో ఫ్రూలెన్ స్వెట్టర్లకు తుది స్వరూపం ఇస్తున్న స్త్రీలు. అంతకుముందే అల్లి తయారుచేసిన స్వెటర్ భాగాలన్నిటినీ చేర్చి కుట్లు కుడుతున్నారు.



గడియారాల ఫ్యాక్టరీలో అతి సునిశితమైన భాగాలను యంత్రాలలో నిర్మించడంలో బ్రిటిష్ మహిళలు ఏవిధంగా సహాయపడగలరో తెలియజేసే చిత్రం

# ఆంగ్ల మహిళల పరిశ్రమ

[పరిశ్రమల అభివృద్ధిని సాధించడంలో పురుషులతో పాటు స్త్రీలు కూడా ముందుకువచ్చి ఎంతైనా సహాయం చేయవచ్చు. బ్రిటిష్ మహిళలు పారిశ్రామిక రంగంలో ఏవిధంగా తోడ్పడుతున్నదీ ఈ నాల్గుచిత్రాలను బట్టి గ్రహించవచ్చు]



మిస్ ఎడిత్ మెకర్వీ; వయస్సు 22 ఏళ్లు; జాన్లి వాట్సన్ మహిళా కళాశాలలో డిగ్రీ పుచ్చుకున్న తర్వాత, ఒకరోగి చికిత్స నిమిత్తం 250 కిలోవాట్ల హైవోల్టేజి విద్యుత్ చికిత్సా పరికరాన్ని అమర్చుతున్నది



ఏ వ్యాపారం గాని, ప్రభుత్వ పరిపాలనా నిర్వహణగాని, వేల లక్షల సంఖ్యలో షార్ట్‌హాండ్ టైపిస్టులు వుంటేనే సక్రమంగా నెరవేరుతుంది. షార్ట్‌హాండ్ టైప్‌రైటింగ్ అభ్యసిస్తున్న ఒక మహిళ.

## ★ ఎండమావులు ★

డుట అనగు. తన్ని గుర్తించదు. అనాసు కుడి క్రింద తీసి వేస్తుంది.

పైగా "ఈచాకిరీతో వసుహూనం అయిపోతోంది. ఉదయం ఆరుగంటలకు లేస్తే రాత్రి పది అయ్యేవరకూ కూడా నడుం వాల్చడానికి తీరుబడే లేదు" అని అనని రోజు లేదు. పైగా తనేదో మహాసుఖపడుతున్నట్లు, ఆ సుఖం కోసం. శరీరాన్ని ముక్కలుముక్కలుగా కోసి రోజు నివాళి పట్టినట్లున్నూ అంటుంది.

దాని త్యాగాన్నిగూర్చి ఆలోచిస్తే, చాలా లుగసానుగా వుంటుంది. ముప్ఫై రోజులూ తిట్లుతిని, నడుంవిరిగేట్లు బల్ల ముందర కూర్చుని, ఆఫీసర్లకు 'జీ హుజూరు' అంటూ వంగివంగి నడుమే వంగినట్లు చేసుకుని, ఆ ఇచ్చే కరుకులకు, ఒళ్లూ కళ్లూ ఒకటో తారీఖుమీద వుంచడం, తీరా ఇంటికి వచ్చేసరికి

"జీతంలో ఈ మాటు ఎనిమిదిరూపాయిలు తక్కువైయ్యేయేం?" అంటుంది.

"నా హోటల్కు..." అంటే

"రోజూ ఫ్లాస్కులో టీ పోసి ఇస్తున్నాగా?"

అల్లా అన్నప్పుడు, కనీసం దూ దూ అంటే వస్తాయి అని పెడితే తింటాయి. కసిరితే దీనాలాపంగా పోతాయి. వాటి విలువల్కూ తన స్థితికి జ్ఞాపకం వచ్చేది పోలిక.

ఈ భార్యలంతా తమ భర్తల్ని, మధ్యతరగతి కుటుంబాల్లో వాళ్ళకి, సరిగ్గా ఎందుకు విలువ నివ్వరు? అన్న ఆలోచనకు సమాధానం దొరకనట్టే కన్పించింది. ఈ నిరంతర వర్గపోరాటం ఎక్కడనుండి పుట్టి, ఎక్కడ అంతమవుతుందీ అన్నదీ అర్థం లేనట్లే కన్పించింది. దానిక్కూ విరుగుడూ కన్పించదు చాలా ఆలోచించేడు...

మానసికశాస్త్రం తిరగేసేడు. వ్యక్తీ వ్యక్తి కోర్కె లేమిటి? ఈ మొండి తలంపుల పుట్టు కెక్కడ? ఏ కారణంచేత? ఏ కోర్కెల అసంపూర్ణత, విపరీత మార్గాల్లోకి దారితీస్తుంది, మొదలైన ప్రశ్నలన్నీ తెల్లగోడమీద నీడ బొమ్మల్లా వున్నాయి.... కుక్కగొడుగులు, మొండి చేతులు అనుకున్నాడు. యాజాలు...

కాఫీ కాళ్లూ చేతులు లాగడం ఎక్కువైయ్యేకనే తెచ్చింది. మాట్లాడకుండా త్రాగేడు కొంచెం ఉషారు కల్గింది సిగరెట్టు వెలిగించేడు.

"మామగారు ఉత్తరం వ్రాసేరు...!"

చదువుకున్నాడు. "వృద్ధాప్యం వల్లచికాకు, పరాకు హెచ్చవుతోంది. తోడుగా ఎవ్వరూ లేరు నువ్వా దూరంగా వెళ్ళిపోయేవు. వ్యవహారాలన్నీ కూడా పెడదారులు పట్టి, మురిగిపోతున్నాయి.

మీ అమ్మ ఆరోగ్యం కూడా సరిగ్గా వుండటం లేదు ఆందోళన కల్గిస్తూ వుంది. పైగా ప్రభుత్వం భూసంస్కరణల్ని అమల్లో పెడదామంటున్నారు.

నీ నూటఏభై రూపాయిల జీతంలోనూ ఏం బావుకుని, త్యాగం చెయ్యగల్గేవో ఇప్పటికైనా అర్థం అయ్యిందనుకుంటాను.

నే చెప్పినమాట నువ్వు విననే లేదు. శుభ్రంగా వ్యవసాయం పెట్టమంటే పెట్టేవు కాదు. నీ అత్తింటి వారి తరప్న మాటేవిని...వెళ్ళేవు..."

ఆ వరసలోవుంది. కని, పెంచి, చదువు చెప్పించినందుకు, ఆయనకు కృతజ్ఞతగా వుండలేదు, ఏం త్యాగం చెయ్యలేదన్న కోపం. ఒక్కొక్కసారి జాలి, ఆరాధనల్లో కరగిపోయి, అమ్మ, నాన్న, గూర్చి ఏడ్పు వచ్చేది. నిజమే ఏం త్యాగం చేసేడు వాళ్ళకు. వాళ్ళ ఈ ముదసలి జీవితాల్లోకి. వెంబడే పెళ్ళాం మీద కోపం వచ్చేది. దాని మూలాన్నే తను దూరమైయ్యేడు. దానిసత్వంకు ఒప్పుకొన్నాడు. తిట్లుపడి, తిని, సంపాదన సంపాదిస్తున్నాడు. అంతా ఎవరికోసం, దానికోసం...కనీసం ఒక్క పది రూపాయిలైనా నాన్నకి పంపించడానికి...అమ్మకు చీర కొని పెట్టడానికి చెల్లెళ్ళకు రవికలగుడ్డ పెట్టడానికి తను నోచుకోలేదు. చెయ్యలేక పోయేడు గుండెలు కొట్లాడుకున్నా...

అది అంటుంది "ఏడు సంవత్సరాలైంది. ఒక్క నగ చేయించేరా! మా అమ్మే పెడుతోంది చీరలన్నీ. నిరుడు సంవత్సరం రెండుప్రింటెడు చీర్లు మాత్రం కొన్నారని" అల్లాంటి సమయాల్లో, రెండు సంవత్సరాల వెనకాల మాత్రం, తను రెండు, రెండంటే రెండు పంట్లాములు కుట్టించుకుని, వాట్లతోనే గడుపుతున్నాడన్న తలంపే వుండదు శారదకు. మానత్వం ఒగులకుందేమో అనీ అనిపిస్తే, గబగబా లేచి ఖండువా వేసుకుని బజారున పడ్డాడు.

కిళ్ళీకొట్టు దగ్గర నుంచుంటేనే, గుడ్డి వాడు వచ్చేడు. మిగిలిపోయిన పైస ఓటి వాడి చేతుల్లో పెడితే వెయ్యి చదివేడు. వంగివంగి నమస్కారాలు పెట్టేడు. ఒక్క కానీతో వాడు కడుపు నింపుకోలేక పోయినా, ఇచ్చిన దాతఎడ కృతజ్ఞత పొట్ట విడింది.

ఒక్కసారిగా శారద చేతుల్లో ప్రతీ ఒకటో తారీఖునా నూటఏభై రూపాయిలు పోస్తున్నా, ఈ కృతజ్ఞత చూపదు; ఎం చేత?

సమాధానం దొరకక, సినీమాకి వెళ్ళేడు. అందులో ప్రేయసి సుఖంకోసం ప్రియుడు



ఏతాము సంగీతం

ఫొటో: ఎస్. కె. బసర్ — మద్రాసు.

త్యాగం చేసేను, అదీ కథ ఆఖరుకు ప్రియుడు మృత్యువుని కౌగలించుకోవలసి వచ్చింది.

చికాకు కల్గింది ఈ వెధవ 'త్యాగం' అనే పదం ఒట్టి స్వార్థంకోసం పుట్టబడ్డ పర్యాయపదం అనుకున్నాడు

ఒంట్లో బాగోలేదన్న వంకలో, పడుకుని గుడ్లప్పగించి చూస్తున్న భార్య చూపులు ప్రశ్నకుంటుంటేనే, యాజులు అన్నం

పెట్టుకుని, తిని, విస్తరి మడిచి, బయట పారేసేడు.

వడ్డం వార్చేటప్పుడే "ఏ పూర్వ జన్మంలో నో పాపం చేసేవు. అందుకు అనుభవిస్తున్నావ్" అంది కర్మ.

ఒళ్ళే తుక్కు అనుకుని దుప్పటీ కప్పుకున్నాడు. డాక్టర్ల కడుపులకోసం మేం త్యాగం చేస్తున్నాం అనే దోమల పాడు వుల మన్నై.

* * *

ఇంట్లోంచి ఆరోజు శారదను వాళ్ళమ్మ తీసుకు వెళ్ళడంతో, ఊరిపి తిరిగినట్లే అయ్యింది. మనస్సుకు స్వేచ్ఛ కల్గింది. ఏవో ఏవో అనుకున్నది. నాన్నకు, అమ్మకు, చెల్లెళ్ళకు, ఈ అదిలేని సెలల్లో చెయ్య గలను, దాంతో మనస్సు తృప్తి పడుతుంది. పైగా వాళ్ళందరూ కూడా తిన్న, ఓ ఉన్నత పీఠంమీద కూర్చో పెట్టుతారని ఆశలు పెట్టుకుని, కట్టుకున్నాడు యాజాలు.

ఒకటి రెండుసార్లు, అలసిపో యివచ్చిన ప్రాణంకు, ఈ ఇంట్లో శూన్యం శారద లేమి వల్ల అలవాటు తప్పలేక బావురుమనిపించేది. అయినా దాన్ని క్రమ్ముకునే వాడు. పైగా దాన్ని తలదుకోవడం, ఇన్నాళ్ళ అనుభవం ఉగ్రపాలతో ద్వేషించేట్లు చేస్తోంది కనుక.

జీవితంలో ఎప్పుడూ స్త్రీ, మగణ్ణి లోకువగా చేసుకోవాలని, డబ్బు చీరల్లో దాచాలని, బంగారం దిగవేసుకోవాలని, తన కొంగుకు ముడి వేసుకోవడం అందరికీ చూపించాలన్న తీజాతురాల్లోటే ప్రపంచంలో పడుతుంది. అందువల్లే ఏకష్టం వచ్చినా, స్త్రీలవల్లే కల్గుతుంది అన్న సమాధానాన్ని నిరుగ్గా చేసుకున్నాడు. ఒకళ్ళిద్దరు ఆప్తీయులదగ్గర చర్చించేడు. వాళ్లూ ఏకమయ్యే సరికి, అసలు జీవితం స్త్రీల్లో అట్టుడుడికి పోతుంది అన్న నిరుకూ కల్గించుకున్నాడు.

ఈ పరిణామం శారదమీద ద్వేషంగా మారిపోయింది. దాంతో తన డబ్బు ఖర్చు పెట్టి, "సెభాష్ ... చాలా మంచివాడు... పరసుడు...యోగ్యుడు...స్నేహపాత్రుడు" అన్న బిరుదాలు కొనుక్కుని గొప్పవాడూ అయ్యేడు యాజాలు.

తల్లిదండ్రులు్క దీపావళికని బట్టలూ పంపేడు. చెల్లెళ్లకు, బావల్కు కొన్కాలు రవాణా చేసేడు ... వాళ్ళంతా మంచి గంధాలే అయి, మల్లె వాసనల్ని కలిపేసేరు ఉత్తరాల్లో ...

అవి ఇవి కలియడంతో వళ్లే మర్చిపోయి శారదలేదనే అనీ అనుకున్నాడు యాజాలు...

* * *

ఆఫీసులో వుండగానే ఆరోజు టెలి గ్రాం వచ్చింది. "శారదకు చాలా జబ్బుగా వుంది ... పురుడు రాలేదు ... వెంటనే బయల్దేరి రావలసింది."

ఆ క్షణంలో వణికేడు. ఒక్కసారి ఏడు వత్సరాల సహాదర్యం జ్ఞాపకం వచ్చింది, కణంకణంమీద నిల్చిపోయిన అనుభవాల్తో.. ఖంగారుగానే రైలుకు వెళ్లేడు ...

అత్తవారింటికి వెళ్లి, మెట్లు ఎక్కుతున్నప్పుడే కాళ్లు వణికేయి. చెప్పలేని అనురక్తి, ఆవేదనే. ఎవళ్ళో తనవాళ్లు దూరమైపోతున్నట్లు...

అత్తగారువస్తూనే "మత్తుమందు ఇచ్చేరు. ఆపరేషన్ చేస్తేనేకాని ..." యగ్గంలో గుక్కమ్మట నీళ్లు కుక్కుతుంది.

కుర్చీలో కూలబడ్డాడు ... శూన్యంలో నిండిన ఆవేదన సముద్రకెరటాలే అయితే.

గడియారం ఘంటలు గడిచేయి ... ఎదురుగావస్తున్న డాక్టరమ్మని చూచితేచి అచేతనులే అయ్యేడు యాజాలు...

"అదృష్టవంతులు ... తల్లీ పిల్లా కూడా కులాసాగానే వున్నారు...వెళ్ళండి" ఉరుకులుగానే నడిచేగదిలోపల్కి వెళ్లేడు... ముత్తు మగతవిడి, చంద్రగహాణాంతంలా... శారద తనవైపు కళ్ళెత్తి, ప్రక్కనున్న పాపనిమాస్తూనే నవ్వింది.... మెరసిపోయిన కళ్ళల్లో జ్యోతుల్ని వెయ్యి వసంతాలే అయితే...

మంచంప్రక్కగానే కూర్చున్నాడు... "ఎంతగా చిక్కిపోయేరు"

దుఃఖం వచ్చింది. ఎందుకో చెప్పలేని కదలిపోయిన కదళీఫల వృతుంలా.

"పాపాయిని..."

మెమ్మదిగా అడ్డం తొలిగించింది.

రక్తం చిమ్మిన ఎరుపుతో ప్రపంచాన్ని చూడలేక పూర్వశ్రీవాసులల్లో చిక్కిపోతున్నాడు...

కళ్ళల్లోకి చూసి మసగ్గవతోంచాల్ని తుకున్నాడు ... శారద... మరిచిపోయింది ... అందులో ఆరాధన, ప్రేమ అనురాగం, త్యాగం అన్నీ మిళాయింటే, అయ్యింది.

ఎంతవెర్రివాజమ్మ వయ్యేవు యాజాలూ! స్త్రీ ఎప్పుడూ త్యాగంచేసేది. నీకోసం, నీభావికోసం, సంతతికోసం, మృత్యువుతో పోరాడి, జీవించేత్యాగి...అదే పురుషుడుకీ స్త్రీకి తేడా? పురుషుడు బ్రతుకన్న ప్రశాంతకంతో పోరాడి త్యాగంచేసేననుకుంటాడు, అదే స్త్రీ సృష్టి జీవన్మరణాలమధ్య త్యాగంతో సౌధాలుకట్టుకుంటుంది" అన్నట్లే ఉంటే బావురుమని పోయేడు.

ప్రక్కతలగడలో దుఃఖం ఆపుకోలేక ముఖం దాచుకుంటే శారద మెమ్మదిగానే ముంగురులు సద్దుతూ?

"పాప, మీ పోలికే..." అంది...

ఏమనాలో తెలియక, ... కిక్కల్లోకి చూసి, తల వంచుకున్నాడు యాజాలు.

★



కావేరి జలపాతం

ఫొటో: ఎస్. వి. పండిట్ — మైసూరు.




## మూడో అధ్యాయం

ఆఫీసు మేనేజరు రావడానికి ఇంకా పది హేను నిమిషాలుంది. ఆఫీసు గుమాస్తాలందరూ కాసేపు పిచ్చాపాటీకి మెయిన్ హాలులో చేరారు. వాళ్లు రోజుకొకరు చొప్పున అందరికీ కిళ్లీలు తెప్పించడం ఒక నియమంగా పెట్టుకున్నారు. ఆ కిళ్లీలు నములుతూ లోకంలోని సంగతులన్నిటి మీదా ఒకరి అమూల్యాభిప్రాయా లొకరికి ఎరుక పరచుకుంటారు. ఒకరి అమూల్యాభిప్రాయాలు మరొకరు అంగీకరించరు. తమ ఒకరి అభిప్రాయం తప్ప మిగిలిన వారందరి అభిప్రాయాలూ తప్పేననుకుంటారు. తమ అభిప్రాయాలను నెగ్గించుకోవడానికి గొంతుక చించుకొని అరుస్తారు. ఒకరి నొకరు తిట్టుకుంటారు. నీకేం తెలుసు నంటే నీకేం తెలుసు ననుకుంటారు. ఎవరిమట్టుకు వారు అవతలవాడు విన్నా వినకపోయినా తన శక్తికొలదీ వాదించి అలసిపోతారు. మేనేజరు కారు గేటులో ఆగిన చప్పుడు కాగానే ఠక్కున నేనుల్లా అయిపోయి కంగారుగా ఎవరి స్థానాల్లోకి వారు పరుగెత్తి లోపలికి వచ్చిన మేనేజరుకు నమస్కారం పెట్టి తమ పనిలో మునిగిపోతారు.

ఆ వేళ అందరికీ కిళ్లీలు తెప్పించడం రఘు వంతు. రఘు కిళ్లీలంటే తెప్పిస్తాడు. అందరితోబాటు నములుతాడు కాని వాళ్ల వాగ్వివాదాల్లో పాల్గోడు. వాళ్ళకు కొంచెం ప్రక్కగా కూర్చొని, ఏ క్రొత్త కావ్యమో చదువుకుంటాడు లేకపోతే వాళ్ళ వాగ్వివాదం తమాషాగా చూస్తూ నవ్వుతూ కూర్చుంటాడు. ఒక్కొక్కప్పుడు వాళ్లు ఎవరి అభిప్రాయాలు వారు అరుచుకోవడంలో అలసిపోయి చివరికి రఘుదగ్గరకు తీర్పుకోసం వస్తారు. రఘు వాళ్ళ నొక్క నిమిషం విశ్రాంతి తీసుకోమని చెప్పి మెల్లగా ప్రశ్నలువేసి అందరి అమూల్యాభిప్రాయాలూకూడా మూడో తరగతి అభిప్రాయాలేనని తేల్చివేస్తూంటాడు. కొన్ని సమయాలలో అందులో ఏ ఒకరి అభిప్రాయమో సరి అన్నాడంటే ఆ అభిప్రాయం వెలుబుచ్చినవాడు ఆకాశం ఎత్తున ఎగిరి పడిపోతాడు: "మాచారా, నేను చెపుతే విన్నారా! మీకేం తెలుసునంటా" అంటూ. రఘు అలా తిరుచు తమ వాగ్వివాదాల్లో ప్రవేశించకుండా, ప్రక్కగా కూర్చొని తన పద్యాలేవో తాను చదువుకుంటూ ఉండడం చూసి వాళ్లు అతని పట్ల అనూయతో బాధపడతారు. రఘుకేం! అందరిలోకీ చిన్నవాడు. ముప్ఫై ఏళ్ళైనా లేవు. అప్సరసలాంటి భార్యా, రత్నాల్లాంటి ఇద్దరు పిల్లలు (ఇద్దరే పిల్లలు - అందులోనూ ఒక మగపిల్లవాడూ, ఒక ఆడపిల్లా ఎంత అదృష్టం!) అన్ని సరదాలు తీర్చుకునేందుకు తగిన జీతం. ఆపైన అతనికి డాక్టరు బిల్లుల గొడవ ఒకటిలేదు. అతనికేం పత్రికలు చదువుతాడు, పుస్తకాలు చదువుతాడు, పద్యాలు రాసి కవిననిపించుకుంటాడు. తామూ అలా ఉంటే అంతకన్న కాలుమీద కాలువేసుకొని బ్రతికేవారే. తామూ పద్యాలమీద పద్యాలురాసి ఉంచేవారే! కాని తామిప్పుడు పద్యాలు వ్రాయడం మాట అటుంచి పుస్తకాలూ, పత్రికలేనా చదవలేకపోతున్నారు. ఎప్పుడేనా తిరగవేస్తే ఒక్క దినపత్రికే ఒక చక్కని కథ చదువుదామంటే తీరుబడీ ఉండదూ, ఓపికా ఉండదు. తమ ఇంట్లోలాంటి పరిస్థితులే ఉంటే రఘుమాత్రం పద్యాలు వ్రాయగలడా, పుస్తకాలు చదవగలడా? ఇక తమ భార్యల అందాలకు తామే మురిసిపోవాలి. అనుకూలత అనలే తలపెట్టడానికి వీలులేదు. తామే తమ భార్యల కనుకూలంగాఉండాలి. 'ఇంట్లో అది లేదండీ, ఇది లేదండీ, ఇలా తిష్ట వేసుకు కూర్చుంటే ఎలా జరుగుతుందండీ? మహారాజులకేనా చెల్లదీదర్జా—మరి కంసాలితో చెప్పారండీ, బోసి చేతులతో పేరంటానికెలా వెళ్ళను చెప్పండీ—అందరూ మూడు పేటల గొలుసులూ, నాలుగు పేటల గొలుసులూ, నాలుగు జతల గాజులూ వేసుకొని తిరుగుతూంటే నేనిలా బోసి చేతులతో వెళ్ళడం ఎంత తలవంపుగా వుంటుందండీ. మరి పిల్లలకు మందులు తెచ్చారా రెండోదానికి ఇంకా జ్వరం తగుల్తూనే ఉంది. ఆఖరిదానికి అజీర్తి విరేచనాలు తగ్గలేదు. అయినా అన్నం పెట్టమని పేచీంచుకొని తినేస్తోంది—మీకేం పడేది నేనూ" అని. 'భార్య సాధింపులతో గోలతో భార్యపట్ల ఏకొస్త అనురాగం మిగిలిఉన్నా అదికాస్తాకూడా ఇట్టే ఆవిరైపోతుంది. రఘుకేం!-ఇద్దరు పిల్లలు. తమకో వద్దన్నకొద్దీ పుట్టుకు వస్తూంటారు ఏడాదికేడాదికీ—ఇంకా నయం కవలలు పుట్టడంలేదు! అందులోనూ మెజారిటీ ఆడపిల్లలే—దిక్కుమాలిన కర్మ' కట్టుకుందుకు చాలినన్ని వరికిణీలు లేవనీ, లాగులు చినిగిపోయాయనీ, బడి జీతాలు కట్టాలనీ ఒకటా వేయి సమస్యలు ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. దీనికితోడు ముసలివాళ్ల గొడవ ఒకటి. వేళకింత తిని ఏమూలో కృష్ణా రామా అనుకుంటూ కూర్చోలేరు. ఊళ్లో సంగతులన్నీ వాళ్లకే కావాలి! "ఏరా అబ్బాయి, పెద్దమ్మాయికి పెళ్లి సంబంధం చూశావుకాదు. ఎన్నాళ్లని ఇంట్లో పెట్టుకు కూర్చుంటావు? ఆ లక్ష్మణరావుగారు చూడు పిల్లలందరికీ పెళ్లిళ్లుచేసి ఎలా తెరపినబడ్డాడో" అంటూ మొదలుపెట్టారు-ఆ క్షణంలో అమ్మాయికి సంబంధం చూసి పెళ్లి చేయకపోతే ప్రపంచంలో ఏదో ప్రళయం పుట్టుకువచ్చి పేసేటట్టు! ఇన్ని బాధలుండి ఇక తమరు రఘులా సంతోషంగా ఉండడానికి అవకాశమెక్కడకి ఉల్లాసంగా ఉంటే ఆఫీసులో ఉన్న కాసేపే. అప్పుడే తమ ఇళ్లగొడవలు మరచిపోయి లోకం పోకడలను గురించి విచారిస్తారు. ఫస్టు తారీఖునాడు వాళ్లి మొగాలు తెరపిగా ఉంటాయి—ఆ వేళ సాయంత్రం చేతుల్లో రూపాయిలు గలగల లాడుతాయి కాబట్టి. ఆ ఉత్సాహం కూడా కొద్దిసేపే. ఆ వేళ ఎంతవరకూ జీతాలమీదా, తమ

అప్పులు తీర్చుకోవడం మీదా సాగుతుంది సంభాషణ. జీతాలు వస్తున్నాయన్న సంతోషం ఒకవైపు ఉన్నా, పాత అప్పులకు మించిన కొత్త అప్పులు పెరుగుతూ రావడం వారికి నిస్పృహా కలిగిస్తూ ఉంటుంది. అందువల్ల ఎప్పుడూ ఫస్టు తారీఖుకోసమే ఎదురుచూస్తూ ఉంటారు—ఫస్టు తారీఖు వెళ్లిన మర్నాటి నుంచీకూడా!

ఆవేళ ఫస్టుతారీఖు. సాయంత్రం జీతాలు వస్తాయి. ఆ నెల అదనంగా రెండు నెలల బోనసుకూడా వస్తోంది. తమ అప్పులు కొంతవరకు వదిలించుకోవచ్చు. కొంత ఊపిరి సలుపుకోవచ్చు, ఆవేళ జీతాలమీద, బోనసుమీద ఎంతో ఉత్సాహంగా మాట్లాడవలసిందికాని వాళ్లకి అంతకన్న ముఖ్యమైన విషయమొకటి దొరికింది. తమ ఆఫీసులోకి ఆడక్లర్కు రాబోతోంది! అపాయింటుమెంటు ఆర్డరు టైపుచేసిన కారా కిళ్లీనమిలే నరసింహామూర్తి ఆ క్షణమే మిగతా గుమాస్తాలకు చెప్పివేసివచ్చాడు. అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. తమమధ్య ఆడ మనిషి! ఇందరిమధ్య! ఈ విషయంమీద చాలా చాలా మాట్లాడా లనిపించింది ప్రతివాడికీ. కాని ఆవేళ అవకాశం రాలేదు. ఏమంటే సాయంత్రం ఐదయి మేనేజరు లేచాడంటే చాలు ఎంత గొప్ప విషయాలు చర్చించదగినవి ఉన్నా సరే ఎవరికివారు వారి దారిని వెళ్లిపోతారు. అందువల్ల ఆ కుతూహలం లోలోపల అణచుకొని ఫస్టు తారీఖు ప్రొద్దున్న ఆఫీసుకు రాగానే వెళ్లబుచ్చారు. ఆఫీసులోకి అడుగుపెడ్తూనే "మన ఆఫీసులోకి ఆడక్లర్కు రాబోతోందిరా!" అన్నాడు నరసింహామూర్తి అప్పటికప్పుడే నాలుగోసారి. "ఇక మనం స్వేచ్ఛగా అన్ని విషయాలూ మాట్లాడుకోవడానికి వీలుండదురా" అన్నాడు బీడీ పొగలోనుంచి ఆలోచనగా చూస్తూ సుబ్బారావు. అతను సామాన్యంగా బీడీలే కాలుస్తాడు. సిగరెట్లెందుకు కాల్చడంటే అవి అంత ఘాటుగా ఉండవంటాడు. నిజానికి అతనికి సిగరెట్లే ఎక్కువ ఇష్టం. అతను రోజుకు ఎలా లేదన్నా ఇరవై బీడీలేనా కాలుస్తాడు. అన్ని సిగరెట్లు కాలిస్తే ఇంటావిడ ఇంట్లో అన్నం పెట్టదని తెలుసు. అందువల్ల స్నేహితులెవరైనా ఇస్తేమాత్రం, మొగమాట పడుతున్నట్లుగా స్నేహం కోసమని తాగుతున్నానని చెప్పి సిగరెట్లమీద సిగరెట్లు అడిగి తీసి కాలుస్తూ ఉంటాడు. బీడీలకుకూడా తక్కువే ఖర్చుచేస్తాడు. తప్పనిసరైనప్పుడు కాల్చడానికి అణాకో బేడకో బీడీలుకొని జేబులో ఉంచుకొని ఊరివెంబడి తిరుగుతూ సిగరెట్లుతాగే ఏమాత్రం పరిచయస్తుడు కనిపించినా పలకరించి ఆపి, కబుర్లలోకి దింపి, సిగరెట్లు పైకితీయించి పంచుకుంటాడు. పొగ వదల్తూ ఊళ్లో విషయాలన్నీ సి. ఐ. డీ లా తెలుసుకుంటాడు. అతని డిపార్టుమెంటు ప్రత్యేకంగా స్త్రీలకు సంబంధించినది. సంసారం చేసే స్త్రీలుకానీ, సంసారం చెడిన స్త్రీలు కానీ కాలేజీ అమ్మాయిలుకానీ కాపురం చేయని స్త్రీలుకానీ ఎవరైనా అతని దృష్టిలో పడకుండా ఉండరు. వాళ్లను గురించి ఏమాత్రం గుసగుసలున్నా సరే అవి అన్నీ సుబ్బారావు జాగ్రత్తగావిని పట్టుకు వచ్చి ఆఫీసులో అందరిమధ్యా పడవేస్తాడు. ఏదో ఘనకార్యం చేసినట్లు. అలా చెప్పే వరకూ అతని మనస్సుకు శాంతి ఉండదు. అతనెలాంటి విషయాలు ప్రసంగిస్తాడో రఘుకు బాగా పరిచయమే కాబట్టి మన స్వేచ్ఛకు భంగం కలుగుతుందిరా అని సుబ్బారావు అనేటప్పటికి, ఎప్పుడూ అంతగా జోక్యం చేసుకోని వాడల్లా అని వేశాడు: "అదీ మంచిదే. అనవసరపు విషయాలన్నీ వినవక్కర్లేకుండా ఉంటుంది. ఇకమీదట." సుబ్బారావు ఒక్క గంతులో లేచి మూతిదాకా కాలిన బీడీ ముక్కను కిటికీలోనుంచి బయటకు విసిరివేసి రఘు వైపుకు కొట్టేవాడిలా వస్తూ అన్నాడు మంటపట్టలేక. "ఊఁ—నేనవసరపు విషయాలు చెపుతానా?—నేను చెప్పేవి అనవసరపు విషయాలైతే నిన్ను వినమన్నా దెవరు?" అంటూ పేచీకి తయారవుతుంటే ఆఫీసులో చేరే కొత్త ఆమెను గురించి వినాలని కుతూహలపడుతున్న కోటేశ్వరరావు మొదలైనవాళ్లు "అబ్బ, ఉండరా సుబ్బారావు నరసింహామూర్తి ఏదో చెపుతున్నాడు చెప్పనీయరా" అంటూ అతని నాపివేసి "ఏరా నరసింహం, ఎవరంటావు ఇంతకీ ఆమె" అని అడిగారు నరసింహామూర్తిని. "మొన్న చూడలేదురా. మిగతా ఇద్దరూ కాక, చాలా అందంగా ఉన్న అమ్మాయి లోపలికి వెళ్లిందే — ఆమేరా" అన్నాడు నరసింహామూర్తి.

"ఎవరూ ఆమె! ఎంత అందంగా ఉంది!

నేననుకున్నాను ఏ కాలేజీ అమ్మాయో మేనేజరు దగ్గరనుంచి ఏ చందా ఓ వసూలు చేయడానికి వచ్చిందేమో ననుకున్నాను. ఆ అమ్మాయే నన్నమాట మన ఆఫీసులో పనిచేసేది! ఎంత అందంగా ఉంది. పాపం బాల్యంలోనే భర్తపోయి ఉండాలి, ఇప్పుడిలా ఉద్యోగం చేసుకొని గడుపుకోవడానికి" అని కోటేశ్వరరావు అంటూనే సుబ్బారావు లేచి అన్నాడు: "ఆమె బాల వితంతువూ కాదు, పెద్ద వితంతువూ కాదు. అంతవరకూ గట్టిగా చెప్పగలను. ఆమె బొట్టు పెట్టుకుంటే!"

"బొట్టా నేను గమనించ లేదురా" అన్నాడు నరసింహమూర్తి.

"బొట్టుందిరా, కావలిస్తే పందెం ఇప్పుడు వస్తుందిగా చూస్తావు" అన్నాడు సుబ్బారావు పందెం కాసేవాడిలా.

ఈ సంభాషణలో ఏమీ పాల్గొని రఘును చూసి నరసింహమూర్తి అన్నాడు: "రఘుకు ఇవేం అక్కర్లేదు. తన భార్య అంత అందకత్తె ఇంకొకతె లేదని గర్వం." రఘు ఒకసారి అతనికేసిచూసి చిరునవ్వునవ్వి మళ్లీ తన పుస్తకంలో పడ్డాడు.

"అయితే ఈ ఉద్యోగం చేయడమేం కర్మరా. శుభ్రంగా తనకుతగిన చక్కని వాణ్ణిచూసి పెళ్లిచేసుకొని సుఖపడక. ఎంతవరకూ చదివిందో" అన్నాడు కోటేశ్వరరావు వెనకాల కూర్చున్న దళసరి కళ్లద్దాల రామలింగయ్య.

"ఇంటర్ మిడియేట్ పాసయిందట. అంతకు మించి నాకేమీ తెలియ"దన్నాడు నరసింహమూర్తి.

"కాని ఈ ఉద్యోగం చేయడమేమిటి? పోనీ ధనవంతులయితే పెద్దచదువు చదువుకోవచ్చు. అంతచదువులు చదువుకోవడానికి వీలులేక, పోనీ అంతసరదాగా ఉంటే ఏస్కూలులోనో పంతులమ్మగా చేరాలిగాని ఇలాంటి ఉద్యోగాలలో ఇంతమంది మగాళ్ళమధ్య చేస్తానని తయారుకావడ మేమిటి? మనవాళ్ళెవరైనా ఇలా చేయగలరా, ఏ ఆంగ్లో క్రిష్టియన్లో ఇండియన్లో తప్ప! అందులోనూ ఇలాంటివాళ్లు ఒంటరిగా ఉంటే—" అంటూ సందేహించాడు దళసరి కళ్ళద్దాల రామలింగయ్య.

"ఇలాంటివాళ్ల సొంపరనో ఎరుగుదుము" అన్నాడు సుబ్బారావు తన అపారజ్ఞానం వెల్లడిస్తూ, "వాళ్లను గురించి పుట్టెడు పుకార్లున్నాయి—"

"పుకార్లేగా—" అన్నాడు రఘు పుస్తకం వెనకనుంచే.

"పుకార్లేమిటి? పుకార్లలో నాలుగింట మూడువంతులు నిజమని నిరూపిస్తాను. ఎంతైనా పందెం" అంటూ ముందుకు వచ్చాడు సుబ్బారావు.

"పందెం ఎవరూ వేయడంలేదు. మన మంతా సరిగావుంటే ఆ వచ్చే ఆమెకేమీ పరవాలేదు" అన్నాడు రఘు.

దానితో అక్కడవున్న వాళ్ళంతా

ఉలిక్కిపడి రఘుకేసి తీక్ష్ణంగా చూస్తూ నోరు తెరుచుకొని ఉండిపోయారు. తమ బుద్ధులే సరిగా ఉండవేమోనా! కాని రఘుకు జవాబీయలేక పోయారు. చివరికి నరసింహమూర్తే అన్నాడు: "చివరికి చూస్తే మీఆవిడచేత కూడా ఉద్యోగం చేయించేటట్లున్నావు."

"అలాగే చేయిద్దును—మా ఆవిడకు చేత కాదు కాని. ఆడది ఉద్యోగం చేస్తే తప్పా? ఎందుకు తప్పు? ఒంటరి ఆడదైనంతమాత్రం చేత అపవాదులు వేయడానికి ఎందుకు తయారుకావాలి? ఆ అపవాదులవల్ల ఎవరికైనా వచ్చే లాభముందా? మనం సరియైన వాళ్ళమైతే ఆమెనుగురించి ఏవిధమయిన ప్రచారం సాగించడానికి సిద్ధం కాకూడదు" అని రఘు అంటూండగానే గేటువైపుకు కమలరావడం చూసి అందరూ కుతూహలముతో అటు చూడసాగారు. కమల లోపలికి అడుగుపెట్టిన వెనువెంటనే మేనేజరు కారు కూడా వచ్చి ఆగింది. గుమాస్తాలందరూ ఎవరిస్థానాలలో వారు కూర్చున్నారు. మేనేజరు లోపలికిరాగానే కమల నమస్కరించింది. మేనేజరు చిరునవ్వుతో ఆమె నమస్కార మందుకొని "లోపలికి రండి. ముందు మిమ్మల్ని మా స్టాఫ్‌లో అందరితో పరిచయం చేస్తాను" అంటూ తనవెంట బెట్టుకొని ఒక్కొక్కరి దగ్గరికే వచ్చి కమలను పరిచయం చేయసాగాడు. స్టాఫ్ అందరూ కంగారుగా లేచినిలబడి కమలను చూసి ఆమెకన్న ఎక్కువ సిగ్గుపడుతూ ఆమెకు నమస్కారం చెప్పారు. మేనేజరు రఘుదగ్గరకు వచ్చాడు. "ఈమె, మిస్టర్ రఘూ, మనకొత్త డిస్పాచ్ క్లర్కు, కమలాదేవిగారు. ఈమె కెప్పుడైనా సాయం కావలస్తే చేస్తూవుండండి," అంటూ కమల వైపుకు తిరిగి "ఈయనే మా అకౌంటెంటు రఘుగారు. కవికూడా—" అన్నాడు మేనేజరు నవ్వుతూ.



"చాలా సంతోషమండీ, మీ కేమైనా కావ్యాలు ప్రచురించారా అండి" అని అడిగింది కమల కవి అనగానే కుతూహలముతో.

"లేదండీ. నేను కవినని చెప్పుకోలేను. ఏవో అప్పుడప్పుడూ గేయాలూ పద్యాలూ రాస్తూవుంటానులెండి. పత్రికలకు పంపితే ఎవరూ వేసుకోలేదండి ఏవో రెండుమూడు తప్పితే. అయినా మా ఆఫీసులో కవిగానే చెలామణీ అవుతున్నాను" అన్నాడు రఘు.

మేనేజరు కమలను తీసుకుపోయి ఆమె స్థానం చూపించి నరసింహమూర్తికి ఆమె చేయవలసిన పని చెప్పమని అప్పగించాడు. నరసింహమూర్తి ఎంతో జాగ్రత్తగా, ఎంతో ఓర్పుతో అన్నీ ఆమెకు తెలియజేశాడు. పని చాలా తేలికైనది. కమల జాగ్రత్తగా విని, పనితెలుసుకొని వెంటనే పనికిపూనుకొంది. పనిచేస్తూంటే చాలా ఉత్సాహంగా వుంది. అంతకుముందు మేనేజరు ఎదుట తాను మగవాళ్ళమధ్య ఒక్కతెనూ పనిచేయగలనని ధైర్యంగా చెప్పింది కాని తీరా ఆఫీసుదగ్గరికి వచ్చేటప్పటికి ఆ ధైర్యం అంతరించిపోయి అనేక అనుమానాలు వేధించసాగాయి. ఆఫీసులో వాతావరణం ఎలా వుంటుందో? ఆఫీసులో మగవారు తనను తక్కువగా చూస్తారేమో? ఆఫీసుపని చాలా ఎక్కువగా ఉంటుందేమో. తా నా పనికి తట్టుకోలేదేమో? అందరూ అధికారాలు చలాయిస్తారేమో? ఈ భయాలతో మెల్ల మెల్లగా అడుగులు వేస్తూ ఆఫీసు చేరుకుంది. సమయానికి మేనేజరు వచ్చి లోపలికి తీసుకువెళ్ళి అందరితోనూ పరిచయం చేశాడు. దానితో కొంత భయం తీరింది. ఆఫీసులో అందరూ మంచివారులా కనిపిస్తున్నారు. మేనేజరు చాలా మంచి వాడులా ఉన్నాడు. లేకపోతే తనకింత త్వరగా ఉద్యోగం ఇచ్చేవాడా? తన నీవిధంగా 'స్టాఫ్' తో పరిచయంచేసి కొత్త పోగొట్టి ప్రత్యేకశ్రద్ధతీసుకుంటాడా? ఈ ఆఫీసులో ఒక కవి కూడా ఉన్నారు. చాలా మంచివాడులా ఉన్నాడు. ఏమీ గర్వం లేనట్లుంది. కవి అనగానే సహజంగా ఒక ఆకర్షణ బయలు దేరుతుంది ప్రతివారి మనస్సులో. కవులనగానే వారికీ క్షుద్ర ప్రపంచపు జంజాటా లేవీ పట్టవనీ, వారి దృక్పథం సామాన్యుల దృక్పథం కన్న ఉన్నతంగా ఉంటుందనీ వారు సూక్ష్మాతి సూక్ష్మ విషయమైనా గ్రహించి వేస్తారనీ, వారి మనస్సులో ఎప్పుడూ భావాలు పొంగి పోతూనా ఉంటాయని అనిపిస్తుంది—సహజంగా ప్రతి కవి అలాంటివాడు కాకపోయినా, భావాలకోసం గంటల తరబడి జుట్టు పీకుతుంటూ కూర్చునే వాడైనా, కవిగారి జీవితం ఎలా ఉంటుందో, ఆయన అభిప్రాయాలేమిటో, కవిత్వం రాసేటప్పుడు ఆయనకెలా ఉంటుందో తెలుసుకోవాలనే కుతూహలం సాహిత్యాభిరుచి ఏ కొంచమేనా కల ప్రతి వారినీ వేధిస్తుంది. కమల మనస్సులో కూడా ఆఫీసులో కవిగారిని గురించి కుతూహలం బయలుదేరింది. ఆఫీసులో పని చేస్తూ కూడా ఎలా కవిత్వం రాస్తున్నాడో! ఆయన ఏం కవిత్వం రాస్తున్నాడో! ఆ కవిత్వం ఒకసారి చూడాలి. చూపించడా! అలాంటి వాడిలా కనిపించడం లేదు. ఎవరితోనైనా స్నేహంగానే మాట్లాడే వాడిలా ఉన్నాడు. కొన్నాళ్లు పోయిన తరువాత, కొంత పరిచయమైన తరువాత ఆయన దగ్గర నుంచి సాహిత్యం గురించి ఏమైనా విషయాలు తెలుసుకోవాలి అనుకుంది. ఈ ఆలోచనలు తలచుకుంటూంటే ఆమెలో ఉత్సాహం పొంగి పొర్ల సాగింది.

మధ్యాహ్నం రిసెస్ వేళ అయింది. మేనేజరు కమలను పిలిపించి 'మీరు టీ త్రాగుతారా, కాఫీ త్రాగుతారా?' అని అడిగాడు. "థాంక్స్, నాకేమీ వద్దండీ, నాకు అలవాటు లేదు" అంది కమల. "కాదు ఈ ఒక్క రోజుకే నేనిచ్చే ఆతిథ్యం స్వీకరించండి, పరవాలేదు. రోజూ మిమ్మల్ని బలవంతం చెయ్యను" అని టీ, టిఫిన్ తెప్పించాడు ఆయన. మేనేజరు ఎంత మంచి వాడు! కమల టిఫిన్ ఆరగించి మేనేజరుకు 'చాలా థాంక్స్' చెప్పి ఇవతలకు వచ్చింది. ఆఫీసులో వారందరూ మెయిన్‌హాలులో ఒక మూలచేరి ఫ్లాస్కులలోనుంచి టీలు కప్పుల్లో పోసుకొని సేవిస్తూ ఏదో విషయం గురించి తీవ్రమైన చర్చలో మునిగిఉన్నారు. రఘు మాత్రం కొంచెం ప్రక్కగా ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్నాడు. ఎలాగైనా కవి కవేగదా! ఇంతలో సుబ్బారావు కమల తనను చూస్తూండడం గమనించి "ఆవిడ మనకేసి చూస్తోందర్రా" అన్నాడు. అందరూ కంగారుగాలేచి, కొంచెం ఎదరకు వచ్చి కుర్చీ చూపిస్తూ "రండి, ఇటు ప్రక్క కూర్చోండి" అన్నారు. "మా వాగ్వాదం వింటున్నారేమిటి? ఏదో మా చర్చల కర్థం ఉండదు లెండి. [illegible] కాఫీ ఇష్టమా, టీ ఇష్టమా అన్న దానిమీద కొట్టుకు చస్తాం. క్రొను వర్సులలో పంపులు తగిందా, సొంపులు తగిందా అన్న దానిమీద పెద్ద తర్జనభర్జన చేస్తాము. ఏదో ఇంటి దగ్గర తోచకపోయినా, ఇక్కడ ఉన్న కాసేపైనా [illegible]గా ఉండాలని ఇలాటి కొల

జేబీలు పెట్టుకుంటామండి, మా కవిగారు తప్ప," అన్నాడు నరసింహమూర్తి. రామలింగయ్య అడిగాడు: "మీరు ఫలహారం తీసుకున్నారా అండి" అని. "ఆ తీసుకున్నానండి. నా కోసం మీరు లేవకండి. నేను లోపల కూర్చుంటాను లెండి" అని కమల సిగ్గు పడుతూ లోపలికి వెళ్ళి పోయింది. ఆఫీసులో వారు ఎంతో మంచివారనుకుంది కమల మళ్ళీ. అందరూ తనను తమతో సమానంగానే చూస్తూ మాట్లాడుతున్నారు. ఈ నాటికి తను ఇందరి మధ్య, వారితో సమానంగా పని చేస్తోంది. నిజమైన సంతృప్తి అప్పుడు పొందింది కమల.

సాయంత్రం ఐదవగానే పని పూర్తి చేసుకొని మేనేజరు దగ్గరకు వెళ్ళింది కమల. "మీరు బాగానే పనిచేస్తున్నారు. మీకీపని చాలా తేలిక. మీ మనస్సుకు పెద్దశ్రమ ఉండదు కాబట్టి ఇంటివద్ద తీరికగా వున్నప్పుడు సాహిత్యంవంటివాటిలో కృషి చేస్తూండండి" అని సలహాఇచ్చాడు మేనేజరు. కమల ఆయన సెలవుతీసుకొని బయటకు వచ్చింది. మిగతా గుమస్తాలెవరూ ఆవేళ త్వరగా బయటపడలేదు—ఆవేళ జీతాలు పుట్టుతాయి కాబట్టి, జీతాలు తీసుకోవడంలో కొంత ఆలస్యమవుతుంది కాబట్టి కమల ఒకతే ఆఫీసుగేటులోనుంచి బయటకు నడచింది. పదిఅడుగులు వేసినతరువాత ఆగిపోయిందిఎటుపోవడమోనిశ్చయించుకోలేక. మళ్లీఆమెకు తానేకాకిని అనే భావంకలిగింది. అంతకుముందున్న ఉత్సాహం చల్లబడింది. ఈఊళ్లో తనకు స్నేహితులుకానీ, ఆప్తులుకానీ ఎవరున్నారు? దూరపుచుట్టాలు దూరపుచుట్టాలే. సీతారామయ్యగారుభార్య కొంచెం పరిచయమయ్యారు కాని ఇప్పుడు తను చేస్తున్న పనితెలిస్తే సీతారామయ్యగారి భార్య ఎలామాట్లాడుతుందో ఆమెకు తెలుసు. మరెవరు తనకు పరిచయస్తులు? ఆఫీసులోవారు పరిచయమైనా వారితో తిరగలేదుకదా. తనకెలా కాలక్షేపమయ్యేది?

జనం ఎవరిదారిన వారుపోతున్నారు. స్నేహితులు జట్లు జట్లుగా కలసివెళ్తున్నారు. ఒకరినొకరు పలకరించుకుంటున్నారు. ఖులాసాగా కబుర్లు చెప్పుకొంటున్నారు. కాని తనకు స్నేహంగా పలకరించేవారెవరు? తనతో సరదాగా కలిసి తిరిగేవారేరీ. తనకోసం కలతచెందే ఒక్క హృదయంలేదీఊళ్లో! కమలకు బెజవాడ భయం కలిగించసాగింది. ఆమెహృదయంలో బెంగ పొంగివచ్చింది. రాజమండ్రిలో తన స్నేహితుల మధ్య ఉంటే ఎంతబాగుండును! రాజమండ్రీ వీధులు, ఇళ్లూ, మేడలూ కాలేజీ గోదావరి అన్నీ కళ్లముందు తిరగసాగాయి. అన్నగారిపిల్లలు జ్ఞాపకం వచ్చారు ఆమె కళ్లలో నీళ్లునిలిచాయి. దారినపోయే వాళ్లు చాలామంది ఆమెకేసి చూసిపోతున్నారు కొందరు యువకులు ఆమెను చూసి తమలో తాము ఏదో చెప్పుకొంటూ పోతున్నారు. కమల లోపలిబాధతో అలాగే నిలబడిపోయింది వచ్చేపొయ్యే బస్సులనూ, బళ్లనూ, జనాన్ని చూస్తూ. మధ్యాహ్నంనుంచి బాడుగదొరకని రిక్షావాడొకడు ఆమె దగ్గర రిక్షాదింపుకొని ఆమెకేసి ఆశగాచూశాడు. "అమ్మగారూ రిక్షాలో వస్తారా" అని మెల్లగా అడిగాడు కమల వినిపించుకోలేదు. వాడు మళ్లీఅడిగాడు "అక్కర్లేదు పొమ్మం" ది కమల. వాడు నిరాశతో నిట్టూరుస్తూ రిక్షా ఎత్తుకొని ముందు కీడ్చుకుంటూపోసాగాడు. వాడిని చూసేసరికి కమలకెందుకో జాలివేసింది. వెనక్కిపిలిచింది. రిక్షాలోకి ఎక్కి కూర్చొని బజారుకు తీసుకుపొమ్మంది. వాడు త్వరగాపరుగెత్తడం మొదలు పెట్టాడు. "తొందరలేదులే, మెల్లగానే లాగు" అంది కమల. వాడు మెల్లగా నడవడం మొదలు పెట్టాడు.

బజారులో ఒక బట్టలకొట్టుముందు రిక్షా దిగింది కమల. రిక్షావాలాకి పావలా ఇచ్చింది. వాడు బేడే వస్తుందనుకున్నాడు. పావలా వచ్చేటప్పటికి ఎంతో కృతజ్ఞతతో చేతులు జోడించి దణ్ణం పెడ్తూ తీసుకున్నాడు డబ్బులు. వాడి సంతృప్తిచూసి మరొక అణా యిచ్చింది కమల. వాడు "వెయ్యేళ్లు జీవించు తల్లీ. నీలాంటి మంచి తల్లులు కనిపించడం అరుదమ్మగోరూ. మారిచ్చావోళ్లబాదలు తెలుసుకొనేవారే తక్కువ మైలు పరుగెత్తించి పావలాడబ్బులు చేతిలో పెట్తారు. అర్ధణా ఎక్కువ ఇమ్మంటే అరగంటసేపు పోట్లాడారు. మీరొచ్చేవరకు ఉండనా తల్లీ" అని అడిగాడు. "వద్దులే, నేను నడచేపోతాను" అంది కమల. వాడు మళ్లీమళ్లీ దణ్ణాలు పెట్టి బండి లాగుకుంటూపోయాడు. వాడి సంతృప్తి, కృతజ్ఞతా చూసినతరువాత కమలకు లోపలి బాధ కొంత ఉపశమించింది. బట్టలకొట్టులోకి వెళ్లింది. షావుకారు ఆమెను చూసి ఎంతో మర్యాదచేసి రకరకాల చీరలు ఆమెముందు విప్పిపెట్టాడు. ఎన్ని డిజైన్లు! ఎంత అందంగావున్నాయి! అన్నీ కొనాలనిపించింది. కాని తాను తీసుకొనగలిగింది ఒకటే. అదైనా పెద్దధరలోదికాదు. షావుకారు ఏదో పెద్దబేరం తగులుతుందనే ఆశతో తనముందు ఇన్ని విలువైన చీరలు పరచడం చూసి ఆమె భయపడింది. జంకుతూ తనకొక తెలవాయిల్ చీరమాత్రం కావాలంది. షావుకారు వెంటనే గ్రహించి, నవ్వుతూ అలాగేనండి అని చీర తెప్పించాడు. ఇంతలో మరెవరో షాపులోకి వచ్చారు. కమల తిరిగిచూసింది. కవిగారు! రఘుకూడా ఆమెనుచూశాడు. "ఓహో, మీరు ఇక్కడే వున్నారే" అన్నాడు చిరునవ్వుతో. "చీరలు కొనుక్కోవడానికి వచ్చానండి" అని చెప్పింది కమల

"నేనూ అందుకేవచ్చానండి. మాఆవిడకు రెండు చీరలు కొందామనుకున్నాను. మీరే చూసిపెట్టండి" అంటూ ఆమె దగ్గరకు వచ్చాడు రఘు.

అతని కలిసిగొట్టు స్వభావానికి సంతోషిస్తూనే, ఇంకా అతనితో స్వేచ్ఛగా మాట్లాడడానికి జంకుతూ "నేను చూసిపెట్టడమేమిటి? మీ భార్యగారికి నచ్చినవి కొనాలిగాని. ఆవిడ బజారుకువచ్చి చూసుకోరా?" అని అడిగింది కమల.

"రాదండీ, ఆవిడ రాణివాసస్త్రీ. మీరు చెప్పండి ఏచీరలు తీసుకోమంటారో. మంచి ఫాషనువే చెప్పండి"అన్నాడు రఘు.

"కాదండీ, ఒకరికి నచ్చినవి ఇంకొకరికి నచ్చకపోవచ్చు" అంది కమల ఇంకా సంకోచంతో.

"పరవాలేదండీ. నచ్చకేంచేస్తాయి. పైగా మాఆవిడకొక "సర్ప్రైజుగా" ఇద్దామనుకుంటున్నాను ఈచీరలు. చాలాకాలం నుంచి కొనాలనుకుంటున్నాను. ఇప్పటికి వీలయింది. ఏదో మంచి ఫాషనువి కొందామని వచ్చాను. కాని అనుమానం వేసింది. నేను సరిగా నాణ్యం చేయగలుగుతానో లేనో అని. సమయానికి మీరు కనిపించారు. ఇక అడ్డుచెప్పకండి. వీటిలో మీకేవి నచ్చుతాయో చెప్పండి. అవే తీసుకుంటా" నన్నాడు రఘు

కమల తెల్ల మైసూర్ క్రేప్ చీర, చిన్న బంగారు పూవులున్న నీలం సిల్కు చీర చూపించింది. రఘు అవే తీసుకొన్నాడు. కమల సాయంతోనే తన పిల్లల కిద్దరకూ గుడ్డలు తీసుకొన్నాడు. తనకొక షర్టింగు గూడా తీసుకొన్నాడు.

"ఏమిటి ఇన్ని ఒక్కసారిగా కొనిచేస్తున్నారు?" అంది కమల ఆశ్చర్యంతో రఘు మాటలమూలంగా కొంచం సంకోచం తగ్గి.

"విశేష మేమీ లేదండి. మాకు ఈవేళ రెండునెలల బోనసు వచ్చిందికదండీ. అది చాలా కాలం క్రిందటనే రావలసింది. ఇప్పుడు అందింది. అందుకే కొంటున్నాను. అసలీడబ్బు అనుభవించడానికే కదండీ మరి" అన్నాడు రఘు సంతృప్తితో నవ్వుతూ.

షావుకారు రఘును బాగా ఎరుగును. అందువల్ల తన పనివాడిచేత బట్టల ప్యాకెట్లు ఇంటికి పంపిస్తానన్నాడు. "వద్దు నేనే పట్టుకు వెళ్లాలి" అని పాకెట్లతో రఘు బయటకు నడిచాడు. కమలకూడా అనుగ

 అ బ ల 

మించింది. ఇద్దరూ కొంతసేపు బయట నిలబడ్డారు. రఘు ఒకచేతిలో ప్యాకెట్లు, రెండో చేతిలో రెండు పుస్తకాలూ పట్టుకున్నాడు. ఒకటి లావుగా నీలంరంగు తోలుతో బైండుచేసివుంది. రెండవది చిన్న పుస్తకం 'ది మాడర్న్ ఇంగ్లీష్ పొయెట్స్' అని ఉంది. కమల ఆపుస్తకాలు చూసింది. "ఆ నీలం బైండు పుస్తకం మీరు పద్యాలు రాసుకునేదా అండి" అని అడిగింది.

"ఔనండి. చూస్తారా?" అన్నాడు రఘు

కమల చూద్దామని అడగలేదు. అతనంత చనువుగా మాట్లాడుతుంటే తానే మాట్లాడకుండా వెళ్లిపోవడం బాగుండదని మర్యాదకోసం అడిగింది. అతను చూస్తారా అనేసరికి "ఎప్పుడైనా మీ కిబ్బంది లేనప్పుడు ఇస్తే చూడాలని ఉందండి" అంది.

"ఇప్పుడే చూడండి. దాని కభ్యంతర మేమిటి? కాని మీరు చదవలేరు. నావ్రాత నాకే ఒక్కొక్కప్పుడర్థంకాదు"అని రఘు పుస్తకం ఆమె కిచ్చాడు. ఆమె చూసింది. చక్కగా బైండు చేసిఉంది పుస్తకం పైన 'నాపూదోట' క్రింద 'రఘు' అని బంగారపు అక్షరాలున్నాయి. లోపల చక్కని కాగితాలు. మొదటి కాగితాలమీద కొన్ని పూల బొమ్మలు, కొన్ని చిత్రువులూ ఉన్నాయి. లోపల పద్యాలున్నాయి. సగంపైగా కాగితాలు ఇంకా ఖాళీగానే ఉన్నాయి. వ్రాసిన పద్యాలు స్పష్టంగా లేవు. చిన్న అక్షరాలు. వాటిపై కొట్టివేతలూ హంసపాదులూ మొదలైనవి వాటిని బ్రహ్మవ్రాతగా చేసివేస్తున్నాయి.

"ఏమండీ, ఏమీ తెలియడంలేదు కాదూ. నేను చెప్పానుకదూ. నేనేచదివి వినిపించాలి. మీకెప్పుడైనా తీరికగాఉంటే నేనే చదివి వినిపిస్తానులెండి. కాని వీటిలో అంతగొప్పదేమీ లేదని ముందుగానే చెబుతున్నానుసుమండీ" అన్నాడు రఘు నవ్వుతూ.

కమల "నాకు మీ పద్యాలు వినాలని చాలా కుతూహలంగా ఉందండీ. ఆ అవకాశం కోసం ఎదురుచూస్తాను" అని పుస్తకం రఘుకు తిరిగి యిచ్చింది. 'సెలవు' అని చెప్పి బయలుదేరింది. రఘుకూడ అటే రాసాగాడు.

"మీఇల్లుకూడా ఇటేనాఅండి" అంది కమల మాట్లాడకుండా వెళ్లిపోవడం బాగుండదని.

"ఇటుకాదండీ ఇటు పార్కుకుపోతున్నాను. నేను రోజూసాయంత్రం కృష్ణానది ఒడ్డుకో, తోటలలోకో, కొండల మీదికో పోతూ ఉంటానండి. అక్కడ ఉండే వాతావరణం కావ్యాస్వాదనకీ, కవితా సృష్టికీకూడా తోడ్పడుతుంది. ఆ వాతావరణంలోనే మనస్సు కూడా శాంతి పొందుతాయి. అసలు ప్రతివాడూ రోజూ కొంతసేపయినా ప్రకృతి ఒడిలో పసిపాపై కాలక్షేపం చేయాలండి. అలాచేస్తేనే మనిషి మనిషిలా ఉండగలడు. లేకపోతే క్రుళ్లులో పెరిగి క్రుళ్లులో నేచచ్చే పురుగుల పాటి అయిపోతాము. ఈ జీతాలు తీసుకోవడంతోటీ, బట్టలుకొనడంతోటీ కొంత ఆలస్యమయింది కాబట్టి ఈ వేళకి పార్కులోకే పోయివద్దామని బయలుదేరానండి. మీరుకూడా వస్తారేమిటి, నా పద్యాలు చదివి వినిపిస్తాన"న్నాడు రఘు.

కమల మళ్లీ సంకోచంలో పడిపోయింది. అనుకోకుండానే ఆయనతో సన్నిహిత పరిచయ మేర్పడుతోంది. ఆమె సహజపు బిడియంవల్ల రానని చెప్పాలనుకుంది కాని ఆయన అలాఅడుగుతూంటే కాదనడం బాగుండదని "వస్తానండీ— అయితే మీ ఇల్లు ఎటండీ మీ భార్యగారిని ఒకమారు కలుసుకోవాలనిఉంది. నా కీఊరులో పరిచయస్తులెవరూ లేరు. మీభార్యగారు పరిచయమైతే నాకుకొంత బెంగపోతుందండీ" అంది. ఇద్దరూ ముందుకు నడవసాగారు.

"ఓదానికేం,అలాగే కలుసుకొందురుగాని ఏ ఆదివారంనాడో మా యింటికివద్దురుగాని. మాయిల్లు రామానగరం చివరఉందండీ" అని చెప్పాడు రఘు.

"సీతారామయ్యగారనే ఆయనకూడా అక్కడేఉంటున్నారు కదండీ?"

"ఆఁఅవును. ఆయన ఎలా తెలుసు మీకు. మీకు బంధువులా?"

"కాదండీ మొన్న రైలులో ఈ ఊరు వస్తూంటే ఆయన భార్యగారితో పరిచయమైందండి."

"ఆయనభార్యతోనే!"

"ఏం అలాఅంటున్నారు?"

"సీతారామయ్యగారు చాలా మంచివారు. అందరికీ ఆప్తులు. ఇక ఆవిడా. నేను చెప్పడ మెందుకు లెండి, మీకే తెలియకుండా ఉంటుందా"అన్నాడు రఘు."పేకెటిలా ఇవ్వండి, నేను తీసుకువస్తాన"న్నాడు. కమల ఈయలేదు. "నేనే పట్టుకు రాగలను లెండి. కాని ఆవిడ నన్ను వాళ్లయింటికి రమ్మని పిలిచింది. ఆ పిల్లలెంతో ముద్దుగా ఉంటారండి నాకెంతో చనువయ్యారు" అని చెప్పింది కమల.

"మీరు వెళ్దామనుకున్నారా?"

"లేదండీ. ఆవిడఅభిప్రాయాలుకొంచెం-"

"కొంచెమేమిటి - మీకు చాలా వ్యతిరేకంగా ఉంటాయి మీరు మంచి నిశ్చయానికే వచ్చారు. ఆవిడను కలుసుకోకండి" అన్నాడు రఘు. ఇంతిలో గులాబీపూలు అమ్మే కుర్రవాడొకడు వచ్చాడు. రఘు తనకొక చేడుపూలూ, కమలకొక చేడుపూలూ ఇప్పించాడు. కమల వద్దంది. కాని అతను తీసుకోక తప్పదన్నాడు లోపల సంకోచిస్తూనే కాదనలేకపోతోంది. సిగ్గుపడుతూ ఆపూలు స్వీకరించింది. రఘు పుస్తకాలు కూడా యెడమచేతిలోకి దూర్చి, ఒకపూవు చొక్కాకు పెట్టుకున్నాడు. కుడిచేతిలో జాగ్రత్తగా గులాబీ పూలగుత్తి పట్టుకొని నడుస్తూ కమలతో అన్నాడు. "మా శారా ఈపూలు యీ రేకలెంత మృదువుగా వున్నాయో! ఈ పూవులో అందం, పరిమళం, సౌకుమార్యం యెంత అద్భుతంగా కలిసివున్నాయో! మానవుడి కళకు కూడా మించివుందనిపిస్తుందది దీనిలో వున్న సౌందర్యం. ఇలాంటిపూల నొకింతసేపు తిలకిస్తే ఏ మానవుడి హృదయంలో సౌందర్యపిపాస బయలుదేరదు? ఏవి హృదయంలో కళాతృష ఉదయించదు? కాని చూడండి మానవుల్లో అధికసంఖ్యాకులు ఇటువంటి సౌందర్యానికి దూరంగా వుండిపోతున్నారు. అటువంటివారి జీవితం తలచుకుంటే నాకు పరమ అసహ్యం వేస్తుందండీ. వారికి జీవితమంటే తెలియదంటాను. జంతువులకూ మనుష్యులకూ భేదమేమిటి? జంతువులూ తిండితింటాయి, పిల్లల్ని కంటాయి. కాలం చెల్లినతర్వాత చస్తాయి. మానవుడూ యీ క్రియలన్నీ చేస్తాడు. కాని తేడాతో చేస్తాడు. తిండి తింటున్నాడంటే కేవలం ప్రకృతిసిద్ధమైన ఆహారం తీసుకొని తృప్తిపడడు. దానిలో ఎన్నో రుచులుమిశ్రమంచేసి ఎన్నో రకాలుగా వండి ఆహారం కేవలం వొక



తృష్ణ తీర్చడానికే కాకుండా ఒక ఆనందం ఇచ్చేదిగా కూడా చేసుకుంటాడు. అలాగే నిద్రవిషయంలో చూడండి పశువు ఎక్కడ పడితే అక్కడ నిద్ర తొంగుతుంది. కాని మనిషి తననిద్రకోసం పరుపులూ పర్యంకాలు తయారు చేసుకుంటాడు. అలాగే యింటి విషయంలో కేవలం తలదాచుకునేందుకు ఏదైతే నేం అని సంతృప్తి చెందడు. ఇంటిని అందంగా కట్టుకోడానికి ప్రయత్నిస్తాడు. అలంకరణ చేస్తాడు. ఇల్లొక స్వర్గంలా వుండాలనుకుంటాడు. అలాగే వేషభాషల్లో. అంటే నిజమైన మానవుడు ప్రపంచంలో ప్రతి వస్తువునుంచీ, జీవితంలో ప్రతి క్రియనుంచి ఆనందం పొందగోరుతాడు. ఒక సౌందర్యం సాధిస్తాడు ఈ ప్రయత్నమే కళ. కళే మానవజీవితాన్ని పశుజీవితం నుంచి వేరుచేసేది. యాంత్రిక జీవితంనుంచి వేరుచేసేదికూడా కళే! కళ అంటే ఎరుగని బ్రతుకు బ్రతికి ఏం ప్రయోజనం చెప్పండి మన చుట్టుప్రక్కల సంచరించే వాళ్లనే తీసుకోండి. ఏవో చదువులు చదువుతారు. పెళ్లిళ్లు చేసుకుంటారు. వెంటనే ఉద్యోగంకోసం తంటాలుపడతారు ఉద్యోగంలో ప్రవేశించి గానుగెద్దులా జీవితంగడిపి, పిల్లల్నికని వాళ్లనికూడా తమమాదిరిగానే తయారు చేసారు. వారూ అదేజీవితం గడిపి తమ పిల్లల్ని అదేజీవితంలో ప్రవేశపెడుతూ వుంటారు. ఇల్లా ఈ చక్రం తిరుగుతూండవలసిందేనా వారిజీవితం మానవజీవితమేనా? పశుజీవితానికెంత దూరంవుంది? ఎన్నడేనా ఒక చక్కని కావ్యం చదివి ఆ రసానుభూతిలో తన్మయులైపోగలరా? ఒక చక్కని పాటకచ్చేరి వింటూ పరవశులైపోగలరా? చక్కని చిత్రంకానీ, శిల్పంకానీ చూసి హృదయం తెరచుకోగలరా? యెందుకు బ్రతుకుతున్నట్లు చెప్పండి. ప్రాచీనకవి చెప్పినట్లు 'పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా' అన్నట్లుగాక," అని ఉపన్యాసం ఇచ్చివేశాడు రఘు ఇన్నాళ్లకు తన భావాలర్థం చేసుకోగలిగే శ్రద్ధాయుక్తురాలైన శ్రోత లభించినందుకు ఆనందంలో మరచిపోయి అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకున్నాడు.

కమల రఘు వుపన్యాసం ఆశ్చర్యంతో అత్యంతాసక్తితో వింది. ఆమె దృష్టిలో రఘు సామాన్య కవిగా లేడు. రఘు అభిప్రాయాలామె మనస్సుమీద ముద్రవేశాయి. అతనిపట్ల విపరీతమైన గౌరవం ఏర్పడేటట్లు చేశాయి రఘు ఉపన్యాసంవల్ల ఆమెకు ఆత్మగౌరవంకూడా పెరిగింది. అంతటికవి తనముందు ఇంతటి ఆవేశంతో తన అభిప్రా

యాలు వెల్లడిస్తున్నాడు. అంటే తనను అతనితో సమానంగా ఎంచుకొనినట్లేగా. స్త్రీ మాత్రం పురుషునితో సమానంగా ఎందుకు గౌరవం పొందలేదు? తప్పక పొందగలదు అనుకుంది కమల. రఘుతో సంభాషణమూలంగా కమలకు అతనిపట్ల సంకోచం పూర్తిగా పోయింది. అతనితో స్వేచ్ఛగా మాట్లాడగల ధైర్యం వచ్చింది. అతని ఉపన్యాసం విన్న తరువాత ఆమెకు కొన్ని క్రొత్త అభిప్రాయాలు కలిగాయి. కొన్ని సందేహాలుకూడా జనించాయి. వెంటనే వ్యక్తపరిస్తే బాగుండదని మెల్లగా అడిగి తెలుసుకోవాలనుకుంది.

పార్కు దగ్గరకు వచ్చి వేశారు. లోపలికి పోయి పూల మొక్కల మధ్య స్థలంలో గడ్డిమీద ఎడం ఎడంగా కూర్చున్నారు. అక్కడే దూరంగా కొందరు పురుషులూ స్త్రీలూ జంటలుగా, గుంపులుగా కూర్చొని ఏవో మాట్లాడుకుంటున్నారు. రఘూ కమలా రావడం చూసి అందరూ కొంత సేపు వారిద్దరికేసి చూశారు. మరి కొంతసేపటికి మళ్ళీ తమ కబుర్లలో పడిపోయారు. రఘు పాకెట్లు ప్రక్కను పెట్టుకొని, వీలుగా కూర్చొని నీలం బైండు పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు "చదవనా?" అని అడిగాడు. 'చదవండి' అంది కమల. ముందు పత్రికలలో ప్రకటింపబడ్డ నాలుగు గేయాలు చదివి వినిపిస్తానని ఆ పేజీలు తిరగవేస్తున్నాడు. ఇంతలో "ఆయనెవరు. ఆయన మన ఆఫీసులో పనిచేసేవారేగదూ?" అని అడిగింది కమల సుబ్బారావు తమకేసి పెద్ద కళ్ళతో చూసి పోతూండడం గమనించి. "ఎవరూ - సుబ్బారావా?" అని రఘు లేచి నిలబడ్డాడు. అప్పటికే సుబ్బారావు ఎటో చాటుకు తప్పుకుపోయాడు.

రఘు మళ్ళీ కూర్చుని నాలుగు గేయాలూ చదివి వినిపించాడు. కమల విన్న తరువాత రెండు నిమిషాలుండి "చాలా బాగున్నాయండి" అంది. రఘు చాలా సంతోషించాడు. కమల వెంటనే అలా అని ఉంటే తనను తృప్తిపరచడానికి అలా అని ఉంటుందనుకునేవాడు. కాని ఇలా కొంచెంసేపు ఆగి చెప్పడంవల్ల, ఆలోచించే ఆ అభిప్రాయానికి వచ్చి ఉంటుం దనుకున్నాడు. నిజమైన తృప్తి పొందాడు. కమల "ఏదీ మీ పుస్తకం ఇలా ఇవ్వండి. మీ రొకమారు చదివి వినిపించారు. కాబట్టి నేనిప్పుడు చదువగలుగుతాను" అని పుస్తకం తీసుకొని ఆ గేయాలే చదివింది. ఆమె మెల్లగా చదువుతూంటే రఘు ఆనందం పట్టలేకపోయాడు.

"పొగడ్తకంటున్నాననుకోకండి - నిజంగా మీరు నా గేయాలు చదువుతుంటే కలిగినంత ఆనందం నాకు మరెప్పుడూ కలుగలేదంటే నమ్మండి. కళ కళకోసమే అన్న సిద్ధాంతం ఎలా ఉన్నా, నాకు ఎవరైనా రసికహృదయులు నా కవిత్వం ఆస్వాదిస్తేనే తృప్తి కలుగుతుందండీ. నా కవిత్వం నాకోసమే అయితే నా భావాలకు రూపమీయడం దేనికి? కాగితంమీద కలం పెట్టడం దేనికి? అందుకే మీరు చదువుతూంటే తీక్ష్ణపు టెండలకెండి బీడు వారిపోయి తొలకరి చినుకులకు ప్రాణంలేచి వచ్చిన భూమిలా అయిందంటే నమ్మండి నా స్థితి. ఎన్నిసార్లు వ్రాసినమీదట, ఎన్నిసార్లు తిరస్కారాలు పొందినమీదట ఈ నాలుగు కవితలూ పత్రికాముఖం చూసే భాగ్యం పొందాయి! పత్రికలోపడిన ఈ కవితలేనా చదివేవారెవరేనా ఉన్నారేమో నని ఎంతవెదికినా "రఘూ నీ కవిత్వం, పేపర్లో పడిందోయ్" అని బుజాలు తట్టే వారూ, టీ పార్టీలు చేయమనేవారేకాని ఒక్కరూ అందులో ఏముందో చదివి తెలుసుకుందామని ప్రయత్నించినవారే కన పడలేదండీ. ఎప్పుడేనా నేను నాకవిత్వం చదివి వినిపిస్తానంటే పెద్దగుర్లతో చూసి, ఏదోవంక చెప్పి తప్పించుకుపోతారు నా పరమ మిత్రులనేవారు కూడా. అందుకే నిరాశతో నిస్పృహతో కవిత్వం వ్రాయడం మానివేదామనే వరకూ వచ్చానండి. వదిలీ వదలలేక బాధపడుతున్నాను. ఈ నాడు మళ్లీ నాలో అణగారిపోయిన ఉత్సాహం తిరిగి లేచింది. భావాలు రాలిపోయిన హృదయం తిరిగి చిగురిస్తోందండి - ఇందుకు మీకు కృతజ్ఞుణ్ణి" అన్నాడు రఘు హృదయపూర్వకంగా.

కమల సిగ్గుతో నవ్వింది: "చక్కని కవిత్వం చదివి ఆనందించినందుకే నేను కృతజ్ఞత కర్తురాలినా? వ్రాసిన మీకే మర్పించాలి," అంది.

ఆ ఉత్సాహంలో రఘు మరికొన్ని చదివేటట్టున్నాడు. కాని అప్పటికి చీకటి పడబోతోంది. కమలకు కంగారుగా ఉంది. కాని ఇక వెళ్దామంటే అతను యేమనుకుంటాడో అని భయం. అందువల్ల అంది: "మీ పుస్తకం రేపు నాకొకమారుయిస్తే నేను మీ నాలుగు కవితలూ రాసుకొని యిస్తాను. అవి నాదగ్గర ఉంచుకోవాలనిపిస్తోందండి" అని.

"మీరు వ్రాసుకోవడ మెందుకు? నేనే జాగ్రత్తగా వ్రాసి రేపు మీకిస్తానులెండి. అయితే వెళ్దామా?" అని లేచాడు. ఇద్దరూ బయటికి నడిచారు. రఘు "ఇప్పుడు నేను వినిపించిన నాలుగింటిలో ఏమైనా దోషాలవంటివి కనిపిస్తే చెప్పండి. ఏవో కొన్ని ఉండేవుంటాయి" అన్నాడు. కమల మాట్లాడలేదు.

"సందేహించకండి. నా హితైషులయితే మీరు సందేహించకుండా చెప్పాలి. దానివల్ల నేను ప్రయోజనం పొందగలుగుతాను. దోషాలు కాకపోతే మీ కేవి నచ్చాయో ఏవి నచ్చలేదో చెప్పండి" అని ఒత్తిడి చేయసాగాడు.

కమల కొంచెంసే పాలోచించి ఏదో చెప్పుదామనుకొని నాలిక చివరవరకూ వచ్చిన తరువాత ఆగిపోయి సిగ్గుపడుతూ "క్షమించండి. నేను చెప్పలేను. నన్ను ఒత్తిడిచేయకండి. మరి సెలవు" అని నమస్కారం చెప్పి తనవీధిలోకి మళ్లింది.

రఘు ఇంటికి బయలుదేరాడు. అతని హృదయం నూతనావేశంతో స్పందిస్తోంది. క్రొత్తభావాలు లేచిపడుతున్నాయి. ఇంటి గడప తొక్కేవరకూ అతనికి జ్ఞాపకం రాలేదు తన ఎడమచేతిలో బట్టలపాకెట్లు

ఉన్నాయన్నది. అప్పుడు చూసుకున్నాడు. వెంటనే ఒకతిమాషా చేయాలనిపించింది. భార్యకోసం తెచ్చిన పాకెట్లు ప్రక్క బీరువాపైన పడవేసి మిగిలిన వాటితోనే లోపలికి నడిచాడు. సుశీల దేవుడి మందిరం ముందు కూర్చుని వీణవాయిస్తూ 'శ్రీరామ పాదమా నీ కృప చాలునే' అనే త్యాగరాజ కృతి కమ్మగా పాడుతోంది. పిల్లలిద్దరూ తల్లిప్రక్కనే అనుకుని కూర్చుని వున్నారు. రఘు మెల్లగా చప్పుడు చేయకుండా చెప్పులు విడిచి గుమ్మందగ్గరకు పోయి నిలబడి పాటవినసాగాడు. సుశీల తనభర్త రాక గమనించలేదు. పాటలో లీనమైవుంది. రఘు అలాగే నిలబడివున్నాడు. అటువంటి అమరసంగీతాన్ని సృష్టించిన

---

త్యాగరాజును తలచుకోకుండా వుండలేక పోయాడు. అతనిహృదయం ఆ మహాకృతి కర్తపట్ల భక్తిభావంతో నిండిపోయింది ఇంతలో పాప వెనక్కు తిరిగి తండ్రిని చూసింది. "నాన్న, నాన్న" అనిఅరిచింది. సుకుమార్ కూడా లేచి తండ్రిదగ్గర కురికాడు. సుశీల కంగారుగాలేచి సిగ్గుతో నవ్వుతూ నిలబడింది. "పాట పూర్తిగాపాడు సుశీ. ఆపుచేశావేం?" అన్నాడు రఘు. కాని సుశీల మళ్ళీకూర్చోలేదు. ఎసరకు వచ్చింది. పిల్లలిద్దరూ తండ్రిచేతిలో పాకెట్లుచూసి ఎగరతన్నుకుపోయి తల్లి చేతిలో పెట్టారు. సుశీల పాకెట్లువిప్పింది. తమకోసం తెచ్చిన గుడ్డలు చూసుకొని "చాలా బాగున్నాయి, నాన్నా" అంటూ గంతులు వేయసాగారు పాపా, సుకుమార్లు. సుశీల రఘు తనకోసం తెచ్చుకున్న షర్టింగు గుడ్డకూడా చూసి "చాలాబాగున్నాయండీ" అంది. కాని ఎంతకీ తనకేమైనా తెచ్చారా అని అడగదేమా అని చూస్తున్నాడు రఘు. ఆమె అడిగితేనే తాను తమాషాచేయడానికి వీలవుతుంది. సుశీల అడగనేలేదు. ఆఖరికి పాపే అడిగింది: "అమ్మకేమీ తీసుకులాలేదూ, నాన్నా" అని. తీసుకు రాలేదన్నాడు రఘు. ఈవిధంగా భార్యను కాసేపాడించవచ్చునని. తనకు బట్టలు తీసుకు రాలేదని సుశీలకు కోపంవస్తుంది. ఆమెకు కోపం తెప్పించి, హఠాత్తుగా ఆమెముందు చీరలపాకెట్టు పెట్టి ఆమె మొగం చూసి ఆనందించాలని ఆలోచించాడతను. కాని సుశీలకు కోపమేరాలేదు. భర్త తనకు తేకపోవడమే మంచిదన్నట్లుగా, "అవును, అన్నీ ఒక్కసారే ఎలాకొనగలరు? ఇప్పుడు కట్టుకుందుకున్నాయిగదా. అవసరం వచ్చినప్పుడే కొనవచ్చు," నంది. రఘుకు అనుకున్నంత గొప్పగా 'సర్ప్రైజు' ఈయడానికి అవకాశం పూర్తిగాపోయింది. ఇకచేసేదిలేక వెనుకకుపోయి పేకెట్లు తెచ్చి భార్యచేతిలో పెట్టాడు. పాప తల్లితో అంది: "చూచావా అమ్మా, నాన్న ఎంతదొంగో! నీకూ కూడా తెచ్చి దాచేశాడు. అమ్మో ఎంతదొంగో!" సుశీల మొగంలో ఆనందరేఖలు విప్పారాయి త్వరగా పాకెట్లు విప్పింది. ఆ చీరలు చూసి అలాగే వుండిపోయింది. తరువాత మడతవిప్పి చూసింది. "ఇదేమిటే! ఇవెందుకుకొన్నారు? ఛీ! ఛీ ఒళ్ళంతా కనిపిస్తుంది" అంది.

"ఎంతో బాగుంటాయని కొన్నాను, సుశీ" అన్నాడు రఘు.

"బాగానే ఉన్నాయనుకోండి కాని ఏ కాలేజీ పిల్లలకో, అలాంటివాళ్ళకో గాని నాలాంటివాళ్ళ కెందుకు. ఎక్కడికేనా వెళ్తానా పెట్తానా? ఎప్పుడూ ఇంట్లో వుండేదానికి నాకు ఏ రంగుచీరలో గట్టి నేతవీ మావుకే ఉతుకుకీ ఆగేవి కొనాలిగాని అంతగా ఎక్కడికేనా వెళ్ళవలసివస్తే జరీ చీరలూ. పట్టుచీరలూ వున్నాయికదా."

"కాదు సుశీ, నే నెంతో మక్కువతో కొని తీసుకు వచ్చాను. నీకు తప్పక బాగుంటాయి. నీవు కట్టుకు తీరవలసిందే" అన్నాడు రఘు.

సుశీల తాను చెప్పకుండానే భర్త చీరలు కొని తెచ్చినందుకు సంతోషమూ, ఇటువంటి కొత్త ఫాషను చీరలు తాను కట్టుకోగలనా అన్న సంకోచమూతో నిండి కొంతసేపు చీరలకేసి చూస్తూ చేతితో పట్టుకు రాస్తూ ఉంది. తరువాత అవి పట్టుకు వెళ్ళి, పెట్టెలో పెట్టి, వంటింట్లోకి నడిచింది. పిల్లలిద్దరినీ చదువుకోమని చెప్పి రఘు దొడ్లోకి పోయి కాళ్ళూ చేతులూ కడుగుకొని వచ్చి భోజనానికి కూర్చున్నాడు. కాని భోజనం మీద ధ్యానమే లేదు ఆవేళ తోచిన కొత్త భావాలు అతనికి మరో దృష్టి లేకుండా చేశాయి. సుశీల భర్త కిష్టమని అల్లపు పెరుగు పచ్చడీ, బంగాళాగుంప వేపుడూ చేసింది. భర్త అవి తిని తనను ప్రశంసిస్తాడనుకుంది. కాని రఘు తాను తింటున్నది అల్లం పెరుగు పచ్చడో వంకాయ పెరుగు పచ్చడో, బంగాళా దుంప వేపుడో కాకర కాయ వేపుడో తెలియకుండా తింటున్నాడు. మళ్లీ వేయమని అడగలేదు. మజ్జిగ పోసుకోకుండానే లేవబోయాడు.

"ఏమండీ, అంత పరధ్యానంగా ఉన్నారేం? మళ్ళీ ఏ కొత్త కవిత్వమేనా రాస్తున్నారేమిటి" అని అడిగింది సుశీల.

రఘు "అవును, సుశీ" అని నవ్వుతూ లేచి చేయి కడుగుకున్నాడు. ఇంతలో పిల్లలిద్దరూ పరుగెత్తుకు వచ్చారు పద్యాలు అప్పజెప్పడానికి. రఘు వాళ్లకొక అలవాటు చేశాడు రోజూ కొకటి చొప్పున పిల్లలకు కొత్త పద్యాలు నేర్పుతాడు. సాయంత్రానికి వారది కంఠతా ఒప్ప జెప్పాలి. ఒప్ప జెపితేనే కాని నిద్రపోవడానికి వీలు లేదు ఇలా చేస్తే వారు పెద్దవారయ్యేటప్పటికి మంచి సాహిత్యాభిరుచికల వారవుతారనీ, స్వయంగా కూడా కవులై పోతారని అతని ఆశ. పిల్లలిద్దరూ ఆ నాటి పద్యం ఒప్ప జెప్పారు. పాప ముద్దు మాటలతో మెల్లగా గుక్క వేస్తూ ఒప్ప జెప్పడం చూసి రఘు గర్వంతో పొంగిపోయి పాప నెత్తుకొని రెండు బుగ్గలూ గట్టిగా ముద్దాడి, సుకుమార్ బుగ్గమీద చిటికివేసి, ఇద్దరినీ చెరో చంకనీ ఎత్తుకొని తీసుకుపోయి వాళ్ల మంచంమీద పడుకో బెట్టి జోకొట్టాడు వాళ్లు నిద్రపోయిన తరువాత తన గదిలోకిపోయి ముందు కమలకోసం తనని వెనక పత్రికల్లో ప్రకటించబడ్డ కవితలు నాలుగూ కాపీ చేశాడు. విశాలంగా పేజీకి పన్నెండు పంక్తుల చొప్పున గుండ్రంగా వ్రాసి, చుట్టూ ఎర్ర సిరాతో బోర్డరుగీసి ఆ కాగితాలు డ్రాయరు సొరుగులో పెట్టాడు. తరువాత ఆవేళ తోచిన భావాలకు రూప కల్పన చేయడం మొదలు పెట్టాడు. కలం పరుగెత్త సాగింది. అతనికే ఆశ్చర్యం వేసింది. తన కవితాధార చూసుకొని. పదాలవంతట అవే భావాలకమరి వస్తున్నాయి గేయం వ్రాసి వేశాడు, తిరిగి చదువుకొని సంతోషంతో నిట్టూర్పు విడిచాడు. కమల ఇప్పుడు కనిపిస్తే బాగుండును; ఆమెకు వినిపించాలి; ఆమె తప్పక ప్రశంసిస్తుంది ఈ కవితను అనుకుంటూ వ్రాసిన కాగితం పైకే చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో సుశీల వంట యింటికి గొళ్లెం పెట్టి వచ్చింది. రఘు ఇంకా తన ఆలోచనల నుంచి తెగక సుశీల మొగం కేసి అర్థం లేకుండా అదే పనిగా చూస్తూ ఉండిపోయాడు. సుశీల సిగ్గుతో నవ్వుతూ కొంగు నోటి దగ్గర పెట్టుకొని "అబ్బ, అట్లా చూస్తారేమిటండీ? నేను కొత్తదానిని కాను కదా. మీరట్లా చూస్తుంటే నాకు చెడ్డ సిగ్గు వేస్తోందండీ" అంది.

రఘు వెంటనేలేచి "ఏది సుశీ, ఇప్పుడు ఆ తెల్ల క్రేప్ చీర కట్టుకురా" అన్నాడు.

సుశీల మళ్ళీ పెద్ద కళ్ళతో "ఇప్పుడే!" అంది.

"అవును ఇప్పుడే" అన్నాడు రఘు.

"అయ్యో మంచిరోజు చూసుకోకుండా కొత్తబట్ట కట్టుకోవడ మేమిటి? వర్జ్యాలున్నాయో ఏమో కూడా లైగా ఏ పేరంటమో పెళ్లికో కాని ఇప్పుడు కట్టుకోవడమేమిటండీ ఈ ఖరీదు చీరలు" అంది సుశీల.

రఘు కొద్దిగా బాధ పడ్డాడు సుశీల ఛాందస భావాలకు "అబ్బ సుశీ, ఇలాంటి వేమీ నాకు చెప్పకు. నే నెంతో సరదాపడి తీసుకువచ్చాను. అది నీ చేత కట్టించి చూడాలని ఎంతో ఉబలాట పడుతున్నాను. నాకీ అడ్డులు చెప్పి నా మనసుకు చాలా బాధ కలిగిస్తున్నావు, సుశీ నీవిప్పుడు కట్టుకు రాకపోతే నేను నీతో మాట్లాడను. ఊఁ కట్టురా" అన్నాడు. రఘు మెల్లగా భార్యను తోస్తూ.

సుశీల మారుమాటాడక వెళ్లింది; తెల్లక్రేప్ చీర కట్టుకొని, వెండి నక్షత్రాలున్న తెల్ల రవిక తొడుగుకొని వచ్చింది. తీరా గుమ్మం

దగ్గరకు వచ్చేసరికి ఆమెకు సిగ్గు ముంచుకు వచ్చింది. కొత్త పెళ్లికూతురులా సిగ్గు పడుతూ గుమ్మం వెనకాలే దాగుకొని కొంగు ముఖాని కడ్డుపెట్టుకొని నిలబడింది. రఘు ఇవతలకువచ్చి భార్యను నిలువుటద్దం ముందుకు లాగుకు పోయాడు. వెనకాల నిలబడి తాను తెచ్చిన గులాబి పూలు ఆమె జడలో గుచ్చాడు. సుశీల మెల్లగా మోమెత్తి కరగిపోతాయా అన్నట్లున్న పెద్ద నేత్రాలతో సిగ్గుగా భర్త ముఖంలోకి చూసింది. రఘు ముందుకువంగి ఆమె నుదుటిమీదా, కళ్లమీదా తన పెదవులతో సున్నితంగా స్పృశించాడు. సుశీల తలదించుకొని భర్త వక్షంమీద ఆనుకొని ముసిముసిగా నవ్వింది. రఘు ఆమె నలాగే పట్టుకొని "చూశావా సుశీ, ఎంత బాగున్నావో, ఈచీర ఎంత బాగుందో నీపైన" అన్నాడు. "ఉండు వస్తాను" అని లోపలికి పోయి వీణపట్టుకు వచ్చి తివాసీ మీదపెట్టి సుశీలను దానిముందు కూర్చోబెట్టి ఆమె ప్రక్కన కూర్చొని "ఇప్పుడు రెండు కృతులు పాడి వినిపించు, సుశీ" అన్నాడు.

సుశీల గిలగిలలాడుతూ "అబ్బ, బాగుండదండీ ఎవరేనా వింటారు" అంది.

"ఏం ఎందుకు బాగుండదూ, ఇంటాక పాడలేదూ?"

"అదివేరు. ఇప్పుడిలా—"

"ఇలా—ఊఁ—"

"ఇలా మీముందు పాడడం సిగ్గుగా ఉంటుందండీ. ఎవరేనా విని ఆక్షేపిస్తారు."

"ఆక్షేపిస్తే ఆక్షేపించనీ సంగీతం వచ్చిన తరువాత పాడకపోతే ఎందుకు. నీకు సంగీతం ఎందుకు నేర్పించారు మీ నాన్నగారు; మేము పెళ్లిచూపుల కోసం వచ్చినప్పుడు మాముందు ఎందుకు పాడించారు-పెళ్లయిన తరువాత నాముందు పాడకుండా ఉండడానికా. ఇదివరకు ఇలాగే చాలా సార్లు తప్పించుకు పోయావు కాని ఈవేళ వదలను."

"మరి పాడతానుండండి, మీరుపోయి మంచంమీద కూర్చోండి. మీరు ప్రక్కన ఉంటే బాగా పాడలేనం"ది సుశీల.

రఘు వెళ్లి మంచంమీద వాలాడు. సుశీల పాట మొదలు పెట్టింది. కాని పొరుగిళ్ల వాళ్లు వింటారేమో నన్న సంకోచంతో గొంతు పూర్తిగా విప్పి పాడలేక, పాట పాడుచేసి సగంలో ఆపుచేసింది. ఇక లాభం లేదనుకున్నాడు. "సరే, ఇలారా, ఒక మాట" అన్నాడు రఘు తనప్రక్క చోటు చేస్తూ.

"చెప్పండి. ఇక్కడే ఉండి వింటాను" అంది సుశీల.

"కాదు ఇక్కడకు రామ్మంటు" అన్నాడు రఘు. సుశీల లేచి వెళ్లి మంచంమీద కూర్చుంది. "ఈవేళ వ్రాసిన గేయం నీకు చదివి వినిపిస్తాను. కొత్తరకం గేయం వ్రాశానులే, విను" అన్నాడు రఘు పుస్తకం తీసుకుంటూ.

"అయ్యో నాకేం తెలుస్తాయండీ మీ పద్యాలు? నేనేం చెప్పగలను?" అంది సుశీల.

"నీవేం చెప్పనక్కర్లేదులే విను" అని అప్పుడే వ్రాసిన పద్యం చదివి వినిపించాడు. "ఎలా ఉందని" అడిగాడు చివర.

"నేనేం చెప్పనక్కర్లేదన్నారు కాదూ-మళ్లీ నన్నడుగుతారేం? నాకేం తెలుస్తుంది."

"అయినా వింటోంటే కొంతైనా తెలియ లేదూ?"

"బాగానే ఉంది కాబోలు" అంది సుశీల.

రఘుకు నిజంగా కొంచెం విసుగు పుట్టుకు వచ్చింది. "నీకు ఇల్లూ, వంటిల్లూ తప్ప మరోలోకమే లేనట్లుంది, సుశీ. నిన్నేం చేయాలి?" అన్నాడు తీవ్రంగా.

"నన్నేమీ చేయవద్దు. ఇలాగే ఉండనీయండి" అంది సుశీల కొంటెగా చూస్తూ.

"ఉండనిస్తానూ—చూడు నిన్నేం చేస్తానో" అన్నాడు రఘు తీవ్రంగా.

ఆమె హడలిపోయింది—ఏం చేస్తాడో నని. కళ్లు పెద్దవిచేసి అతనికేసి జాలిగా చూసింది. కన్నీరు నించిందామె విశాల నేత్రాలలో. ఆమె సుందర వదనంపైన ఆ కన్నీరుచూసి రఘు ఆగలేకపోయాడు. ఆమెను దగ్గరకు లాగుకొని కన్నీరు తుడిచి చెక్కిళ్లు నొక్కుతూ అన్నాడు "నీవు వట్టి అమాయకురాలివి సుశీ."

భర్త అనురాగానికి తృప్తితో ఆనందంతో పడకమీదకు వాలింది సుశీల. కాని రఘు ఆలోచనల్లో మునిగిపోయాడు — సుశీల కీమితిమీరిన సిగ్గూ, ఛాందసపు వేషాలూ, భావాలూ ఎలా పోతాయాఅని. సుశీల సనాతనుల ఇంట్లో పుట్టి పెరిగింది. చదువుకూడా తక్కువ. పెళ్లయి కాపురానికి వచ్చిన తరువాత భార్యచేత బాగా చదివించి విద్యాధికురాల్ని చేయాలనీ, ఆధునిక భావాలూ, పద్ధతులూ కలదానినిగా చేయాలనీ ఎంతో ప్రయత్నించాడు కాని విఫలుడయ్యాడు. ఆమెమీద ఉన్న అమిత ప్రేమవల్ల ఆమెను ఒత్తిడి చేయలేక పోయాడు. ఆమె తన జాలికళ్లతో ఒక్కసారి అతని మొగంలోకి దీనంగా చూసిందంటే చాలు కరగిపోయేవాడు. ఆమెపట్ల ఉన్న ప్రేమ ఆమెలో ఉన్న లోపాలను పట్టించుకోనీయకుండా చేసింది. కాని ఇప్పుడు కమలను చూసిన తరువాత మళ్లీ అతనిలో అసంతృప్తి బయలుదేరింది. కమలలో చదువూ, అందమూ, అన్ని లక్షణాలూ ఎంత బాగా శోభిస్తున్నాయి. ఆధునికురాలైనంత మాత్రంచేత, ఆమెలో సిగ్గూ వినయమూ లేకుండా పోయాయా? నిజంగా కమల ఎంత మర్యాదగా మాట్లాడింది. అది తలచుకునే సరికి రఘులో మళ్లీ తన భార్య పద్ధతులు మార్చాలనే కోరిక బయలుదేరింది. ఇదివరకు పోల్చే అవకాశం లేదుకాబట్టి సుశీల లోపాలు అంతగా బాధపెట్టలేదు కాని ఇప్పుడు కమల రాకతో ఆమె లోపాలు స్పష్టంగా కనిపించసాగాయి. సుశీలకూడా కమలలా మారిపోతే ఎంత బాగుంటుంది! ఈ ఆలోచనతో భార్య మొగం కేసిచూశాడు. విప్పారిన పద్మం లాంటి గుండ్రని మొగం, ముట్టితే కందిపోతాయన్నంతటి సుకుమారమైన చెక్కిళ్లూ దొండ పండ్లవంటి పెదవులూ, అంతులేని లోతులున్న నేత్రాలు చూసి గర్వంతో అతని హృదయం పొంగిపోయింది. భర్త తనకేసే చూస్తూండడం గమనించి సిగ్గుతో కళ్లు మూసుకుంది సుశీల. రఘు ముందుకువంగి ఆమె మొగంమీదకు మొగం చేర్చాడు. సుశీల కిలకిల లాడింది. రఘు ప్రక్కకు వాలి పోయాడు.

(ఇంకావుంది)

# బొంబాయి సినిమా లేఖ

భారత్ భూషణ్, నిమ్మి, చంద్రశేఖర్, ఓంప్రకాష్ మున్నగువారు నటిస్తున్న "బసంత్ బహార్" చిత్రం చాలవరకు అయిపోయింది. టిప్పుసుల్తాన్ నాటి కథతో నిర్మితమవుతున్న ఈ చిత్రం నాట్య, సంగీత మయమై ఉంటుంది. శంకర్, జైకిషన్‌లు సంగీతం నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి క్లైమాక్స్ సన్నివేశం ఇంకా నిర్ణయం కాలేదు. విషాదాంతంగా ఉండాలా, సుఖాంతంగా ఉండాలా అనేవిషయమై కూడా నిర్మాతలలో భిన్నాభిప్రాయాలు ఏర్పడ్డాయి.

* * *

డి ఎన్ మధోక్ దర్శకత్వాన మధుబాల నిర్మిస్తున్న "నట" చిత్రం దాదాపు పూర్తి కావచ్చింది. ఈచిత్రం తరువాత "షాం-ఇ అవధ్" అనే మరొకచిత్రం మధుబాల నిర్మించనున్నది. ఆచిత్రాన్ని ఆమె స్వయంగా డైరెక్ట్ చేయనున్నది. అగ్రశ్రేణికి చెందిన బొంబాయి స్త్రీతారల్లో దర్శకత్వం నిర్వహించబోయే మొదటితార మధుబాలయే.

* * *

తావర్ బ్రదర్స్‌వారి "మిస్ ఇండియా" చిత్రంలో మిస్ ఇండియాగా నర్గీస్ నటిస్తున్నది. నాయకపాత్ర ప్రదీప్ కుమార్ ధరిస్తున్నాడు. విలన్‌గా ప్రాణ్ నటిస్తున్నాడు. రచయిత ఐ ఎస్ జోహార్ దీనికి దర్శకుడు. రజతోత్సవ చిత్రం "నాస్తిక్" నిర్మించింది ఈయనే. రాజ్‌కపూర్‌తో నే కాక ఇతరులతో కూడా నటించడానికి నర్గీస్ నిశ్చయించినప్పటినుండి ఆమె పలుకుబడి ఇంకా హెచ్చుతున్నది.

* * *

ఇవేళల బొంబాయిలో "ప్యాసే నైన్" (షేక్ దండ్ టాకీస్ చిత్రం) "తాతార్ కా చోర్" అనే రెండు చిత్రాలు విడుదలైనవి. 'ప్యాసే నైన్'లో నిమ్మి, శ్యామ, రెహమాన్ నటించారు. కుటుంబ కష్టాలను చిత్రించే ఈ చిత్రంలో అన్నిటి కంటే మెచ్చుకోదగినది సంగీతం. పూర్వం "మన్‌కీజీత్"లో చక్కని సంగీతం కూర్చిన ఎస్ కె పాల్ దీనికి సంగీతదర్శకుడు.

"తాతార్ కా చోర్"లో శ్యామ, ముకీపాల్, చంద్రశేఖర్, విజయలక్ష్మి నటించారు. తెలుగువాడైన చంద్రశేఖర్ ఇందులో అందరికంటె బాగా నటించాడు.

* * *

## "వచన్"

గీతాబాలి, బల్రాజ్, రాధాకిషన్, ఎస్ కె ప్రేమ్, నిరూపా మున్నగువారు నటించిన "వచన్" హిందీచిత్రం మద్రాసు, స్టార్, అశోక్ థియేటర్లలో ఈనెల 11న విడుదల అయింది. ఈచిత్రం బొంబాయిలో రజతోత్సవం జరుపుకున్నది. ఒక యువతి అంధుడైన తండ్రిని, బాలుడైన తమ్ముణ్ణి పోషించడానికి గత్యంతరంలేక, తనను పెండ్లిచేసుకుంటానని వాగ్దానం చేసిన ప్రియుణ్ణి పెండ్లిచేసుకోకుండా చాలకాలం బ్రహ్మచారిణిగానే ఉండిపోతుంది. ఈలోగా ఆమెప్రియుడు మరొకర్ని వివాహమాడడం, తను కష్టపడి పెంచి పెద్ద చేసినతమ్ముడు భార్యమాటలు విని ఆమెను ఇంటినుండి వెళ్లగొట్టడం, అఖరుకు తప్పు తెలిసకొని ఆమెను క్షమాభిక్ష కోరడం, ఇంతలో ఆమె ప్రియుడు తనభార్య చనిపోగా ఈ యువతిని పెండ్లాడి వాగ్దానం నెరవేర్చుకోవడం ఈ చిత్రంలోకథ. కొన్ని కొన్ని పాటలు చక్కగా ఉన్నాయి. గీతాబాలి నాయికపాత్రను బాగా నిర్వహించింది. దీని దర్శకుడు రాజ్ రిషి. ★



చైనా పర్యటనకు వెళ్లిన భారత చలన చిత్ర పరిశ్రమ ప్రతినిధివర్గంపెకింగ్‌లోకల్లా పెద్దదైన "వేసవిప్రాసాదం"లో ఒకరోజు గడిపారు. ఈ బృందం నాయకుడు శ్రీ పృథ్వీరాజ్ కపూర్‌ను ఫొటోలో చూడవచ్చు.





"టాంగావాలి" హిందీచిత్రంలో నిరూపరాయ్



"తెనాలి రామకృష్ణ"లో మాధవుడుగా మాస్టర్ వెంకటేశ్వర్



విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "తెనాలి రామకృష్ణ"లో భానుమతి

*　　　　*　　　　*

జూపిటర్ వారి "నయా ఆద్మీ"లో ఎన్. టి. రామారావు, అన్వర్ హుసేన్





వరవీణా మృదుపాణి

చిత్రకారుడు: టి. అప్పారావు—శ్రీకాకుళం

# వ్రతం చెడ్డా

## బొడ్డు బాపిరాజు

హేమంతసుందరి షిఫాన్ మేలిముసుగులా సుకుమారంగావున్న పుష్యమాసం ఎండలో త్రిగించుకుంటూ ఫోర్డు కారు వచ్చి పోర్టికోలో నిలబడింది. కన్నుల విందుగా చుట్టూతోట. ముగ్ధ తీర్చికట్టిన మేడ. పోర్టికోకు ఎదురుగా ఫవుంటెన్‌లో పాలరాతి జలసుందరి. చుట్టూ రకరకాల క్రోటన్‌కుంపట్లు. గేటు దగ్గర్నుంచీ అందాకా మధుమాలతి పూలతీగెలు ప్రాకించిన ఆర్చి. అన్నీ ఆ మేడయజమాని ఐశ్వర్యానికి కొలతబద్దల్లాగా వున్నాయ్.

డ్రయివర్ తలుపు తెరిచాడు. శివకామేశ్వరప్రసాదరావు భార్య నాగమణి కిష్టమైన కనకసంపెంగ పూలపొట్లం ఒకచేత్తో మరోచేత్తో గుప్పెడు పత్రికలూ పట్టుకుని కార్లోనించి దిగాడు. చల్లని గాలికెరటం విసిరింది. సంపెంగతావుల్ని తరుముకుంటూ గులాబీసెంటు పరిమళాలు సుళ్లు తిరిగాయి

ఉల్లిపొరలాంటి మెర్సరయిజ్ గ్లాస్కో పంచీ, ఖద్దరు శిల్కులాల్చీ, మడత పెట్టిన మధుర జరీకండువా అతనిఅందాని కమర్చినట్లున్నాయ్. తుమ్మెదరెక్కల మెలికట్టినట్లు నొక్కుల్నొక్కులతో చక్కని ఉంగరాల క్రాపూ, గేదంగి రేకులా వున్న విశాలమైన ఫాలం, విలువంపు లనిపించే తీరైన కనుబొమ్మలూ, కొండవాగులా సాగి వచ్చిన నాసికా, తాంబూలరాగరంజితంగా మందారపు మొగ్గలవంటి పెదవులూ ఆ సుస్వరూపం మొదటిచూపులోనే మనస్సు నరికడతాయి.

డ్రయివర్ సలాంచేసి వెళ్లిపోయాడు. శివరావు నడుస్తూవుంటే మడతలు పెట్టి జారవిడిచిన పంచెకుచ్చెళ్లు కొమ్మూర్ స్లిప్పర్సుమీద వుయ్యాలజంపాల లూగుతున్నాయి. వరండాలోనించి హాల్లోకి వచ్చాడు. తిన్నగా మెట్లెక్కబోతూ మెట్లప్రక్కనే టర్కీటవల్ మడతల్లో మూగవీణలా నిద్రపోతూవున్న పసిపిల్లడ్ని చూచాడు. చూస్తూనే ఎలక్ట్రిక్ షాకుతిన్నవాడిలా అయిపోయాడు శివరావు. అతనిశరీరంలోని రక్తనాళాలు కుంచించుకుపోయినట్లయాయి. జారిపోయిన చేతిలోవస్తువులు అతని స్థితికి సానుభూతి చెపుతున్నాయి

శివరావుకు గుర్తువచ్చింది. నాలుగయిదు రోజుల క్రితం షాపులో కుర్రాడు తెచ్చిచ్చిన పోస్టులో తనని పలకరిస్తూవున్న వూదా కవరు ముందుగా తీశాడు. ఆ కవరుమీది ఆణిముత్యాల్లాంటి అక్షరాలతడ్ని చూచి అపహసిస్తున్నాయి. ఒకప్పుడీ అక్షరాలకోసం నిజంగా తపస్సే చేశాడతను. కవరు చింపుతూవుంటే రవ్వల వుంగరాల వేళ్ళు వణికాయి. డేగరెక్కల దప్పుడు పసికట్టిన గుడిమీది పావురంలా కువకువలాడిపోయిందతని మనస్సు.

ఉత్తరం ఒకటికి రెండుసార్లు చదువుకున్నాడు. పైన ఫాన్ తిరుగుతున్నా చెమటలు పోశాయి. సుభద్ర తరహా తెలుసు. అన్నంత పనీ చేస్తుంది. —"బుధవారం మెయిల్లో బాబుని తీసుకుని వస్తున్నా. ఆదరించి అందుకుంటే ఆనందమే. కాదంటే గడపముందు పిల్లడ్ని విడిచిపెట్టి వెళ్లిపోతా"—సుభద్ర మాటలు చెవుల్లో మోగుతున్నాయి. ఉత్తరం బెదిరిస్తూవున్నట్టులేదు. సుభద్ర తనకోసం కన్నా పిల్లడి భవిష్యత్తుకోసం పడే ఆరాటానికి ప్రతిబింబమా వుత్తరం. 'ఆమె అడిగితే నేనేం చేయను? శరణాలయంలో చేర్పిస్తా, విద్యాబుద్ధులు చెప్పిస్తా, పెండ్లీ పేరంటం చేస్తా. అంతకన్నా ఏం కావాలి?" అనుకున్నాడు శివరావు. ఆమె కోరవలసిందది కాదు. తన బిడ్డకు సంఘంలో గౌరవం వుండాలి. తండ్రి నెరుగని నిర్భాగ్యుడు కాకూడదు!

'ఈ వుప్పెన ఎట్లా తట్టుకోవడమా' అని ఆలోచనల్ని ఎన్నో మలుపులు త్రిప్పాడు శివరావు. నిశ్చలకాసారంలావున్న కుటుంబ జీవితంలో రాళ్లు విసురుకుని లేనిపోని కల్లోలాలెల్లా రేపుకుంటాడు తను? స్థిరపడ్డ పేరుప్రతిష్ఠలను ఖూనీచేసుకోగలడా?— 'సుభద్రను రానీకూడద'నుకున్నాడు. స్వయంగా వెళ్ళి సమాధానపరచి రావడంకన్నా మరో మంచి మార్గం కనిపించలేదు. మర్నాడే వెళ్లడానికి సంకల్పించాడు.

ప్రతిదీ అనుకున్నట్టు జరిగితే ఇకనేం! శివరావు సంకల్పం ఆ రాత్రి హఠాత్తుగా భార్య నాగమణికి వచ్చిన నూటనాలుగు డిగ్రీల జ్వరంలో కరిగి ఆవిరైపోయింది. రెండు మూడు రోజులవరకూ షాపుక్కూడా వెళ్ళకుండా వుపచారం చేస్తూ యింట్లోనే వుండిపోయాడు. ఎల్లా వచ్చిన జ్వరం అల్లానే తగ్గిపోయింది. నాగమణి నిన్ననే పథ్యం తీసుకుంది. ఇవ్వేళే శివరావు షాపుకు వెళ్లినట్లు వెళ్ళి ఏవో నాలుగైదు పత్రికలు భార్యకని కొనుక్కొని వెంటనే వచ్చేశాడు.

భార్యా సుస్తీ ఆగుర్దాలో కూడా ఒకటి రెండుసార్లు వూదాకవరతని మనసులో గుసగుసలాడబోయింది కాని జ్వరం మూలుగులు దాన్ని మ్రింగివేశాయి.—ఇవ్వేళే బుధవారం అనుకున్నాడు.

పిల్లడ్ని చూచాడు. వెండిమబ్బులమీది చందమామలా, పాలకెరటాలపైని బంగారు పద్మంలా అతి ప్రశాంతంగా నిద్రపోతున్నాడా పసివాడు. ఏ దుఃఖమూ ఎరుగని పరమాత్మ. ఆ ప్రక్కనే కూర్చున్నాడు శివరావు. మూతలుపడిన కంటిరెప్పలు మల్లెపువ్వు రేకుల్లా చక్కని వాల్పుల్తో నయనాభిరామంగా వున్నాయి. ఆ ముఖంలో అన్నీ తనపోలికలే అనిపిస్తున్నాయతనికి. 'నేను నీవాడనయ్యా!' అన్నట్టుందా ఉంగరాల జుత్తు. మిసమిసలాడుతూ పనసతొనలు పేర్చినట్టున్నాయా పసి అవయవాలు. 'ఈ చిన్న దేహంలో తన పూర్వుల రక్తం ప్రవహిస్తూ ఉంది. తన వంశవృక్షం వేసిన చిన్ని చివురాకు. తన అజ్ఞాత ప్రేమలు పండించిన పంట' అనుకున్నాడు.

మనస్సు వూసరవెల్లి క్షణంలో రంగులు మారుస్తుంది - ఇంత చక్కనివాడు నాగమణికే పుడితే తనెంత సంతోషించేవాడు. ఎంత హంగామా ఎన్ని వేడుకలు చేసేవాడు! అప్పుడు లోకం ఆ పసివాడ్ని ఆశీర్వదిస్తుంది. ఇప్పుడో తన్ను దోషినిచేసి

# ★ వ్రతం చెడ్డా ★

లో నెక్కిస్తుంది. 'ఎవరివా దయ్యాయ్ శివరావు?' అని ప్రశ్నిస్తుంది. తను చేతులు కట్టుకొని 'నా కొడుకు' అంటాడు. 'నీ ధర్మపత్ని నాగమణికి పుడితేకదు నీ కొడు కవడానికి' అంటుంది లోకం. 'నాగమణికి కాకపోతే నా హృదయేశ్వరి సుభద్రకు-' మాట సగంలో నే - "సుభద్రను నువ్వు పెళ్ళిచేసుకోలేదుగా. ఇతను నీ వ్యభిచార ఫలముందూ——" అంటూ లోకం పకపక లాడుతుంది.

శివరావు చెవ్వుల్లో గవ్వలు గిలకరించి నట్లు నవ్వులు వినిపించాయి. త్రుళ్ళిపడి వెనక్కు తిరిగాడు. మైసూరు రోజ్ వుడ్ సోఫా సెట్టు 'ఎవరూలేరు బాబూ' అంటూ అతనికేసి జాలిగా చూచింది. తోటలో ఎవరో ఎందుకో నవ్వుకుంటున్నారు.

మళ్ళీ ఆలోచనలు పొగమబ్బుల్లా అవ రించాయి. —తనకేం తెలియనట్టు పైకి వెళ్ళిపోతాడు. ఏదేమైతే తనకెందుకు? తన గౌరవజీవితానికి శాపంలా వచ్చాడు. ఏ పుట్టమీదో పెరుగుతాడు. ఏ చెట్టు నీడనో బ్రతుకుతాడు. తన కేం వీధులు పట్టుకు తిరగనీయ్ బికారిలా. ప్రొద్దుటి దృశ్యం కళ్ళముందు కదిలింది - షాపునుంచీ ఇంటికి వస్త్రా మార్కెట్ దగ్గర కారాపి భార్య కోసం పూలుకొంటున్నాడు. కారు కదిలే ముందు ఎక్కణ్ణించో పరుగెత్తుకుంటూ తలుపుదగ్గర నిలిచి 'బాబూ ఒక్క కానీ ధర్మం!' అంటూ ఆ పేతుతో పొగమారిన కట్టెపుల్ల చెయ్యి తనకేసి చాపిన ఆ దరి ద్రాగ్నిస్ఫులింగాన్ని అయిదేళ్ళ వికా రాన్ని పొమ్మనలేక జేబులో పర్సు తీస్తూ ఉండగానే కారు కదిలింది. ఆప్రా డక్కడే నీళ్ళుగారుతూ రోడ్డు దుమ్ములో నిలుచుండిపోయాడు - శివరావు శరీరం జలదరించింది. తను కాదంటే ఈఅందాల చందమామ బ్రదుకంతే అవుతుంది.

పిల్లాడు నిద్రలో నవ్వుతున్నాడు. తన సిరికితనానికి ధర్మదేవత నవ్వుకుంటున్నట్లని పించింది, శివరావుకు. అతనిలో ఒక తియ్యని మమకారం జలలా పుట్టింది. ఎవ రికో జన్మని యీదేవుడిచ్చిన వరాన్ని కళ్ల కద్దుకోకుండా కాళ్ళను తన్నుకోవడమా? తన కింతవరకూ బిడ్డల్లేరు. ఈవరహాలతండ్రిని బంగారపు టుయ్యాలల్లో వూపుకుంటాడు. పిల్లల్లేని యింత పెద్దమేడా ఎప్పుడూ నిద్ర పోతూనే వుంటుంది. తమ భార్యాభర్తల జీవితాలు నిస్సారంగా ఎడారిలో బాట సారుల్లా మందకొడిగా జరుగుతున్నాయి.- ఉదయం లేవడం. స్నానం ఫలహారం. తను షాపుకు వెళ్ళడం. ఆవిడ ఏఅల్లికో పత్రికో ముందు వేసుకూర్చోవడం మధ్యాహ్నం వంటమనిషి వడ్డిస్తే భోం చేయడం. మళ్లీ షాపు - మళ్లీ భోజనం - నిద్రా - యీదినచర్య పట్టాలమీది రైలు బండిలా ఒకమాధుర్యం ఒక ఆకర్షణా ఏమీ లేకుండా సాగిపోతే యిల్లా ఏం బావుం టుంది? ఒకపాపాయి అవసరమేమో అని పించకపోలేదు. అతనిలో పితృస్నేహం తొలకరించింది. నాగమణికి యథార్థం చెప్పి వప్పించాలి. సుభద్ర కిదివరకే చేసిన అన్యా యాన్ని యింకా హెచ్చిస్తే దైవం మెచ్చదు. తనలాగే తనకొడుకూ అదృష్టవంతుడు గను కనే తనయింటికి తర్లివచ్చాడు. తన్నొకనా డదృష్టదేవత దీవించివుండకపోతే ఈనిస్తు లైశ్వర్యానికి తానధికారై వుండేవాడేనా? ఎక్కడో గోళ్లు గిల్లుకుంటూ గుమాస్తా గిరిలో కునికిపాట్లుపడుతూ కూర్చుండే వాడు. ఇల్లానే పడుగుపేకలై అతని ఆలో చనలల్లుకపోతున్నాయ్.

సరిగ్గా అప్పటికి పదహారు నెలలక్రితం అక్టోబరు అయిదో తారీఖున మునిముని చీకట్లలో శివరావు బొంబాయి విక్టోరియా టెర్మినస్‌లో మద్రాసు మెయిల్ దిగి సామాను కూలీకిచ్చి బయటకునడుస్తున్నాడు. 'ఏహోటల్‌కు బాబు?' అన్న పిలుపు విని పించింది. కాని ఏహోటల్ ఏజెంటో అను కుంటూ ముందుకు నడిచాడు తిరిగి చూడ కుండా. మళ్ళీ అదేప్రశ్న. వెనక్కు తిరి గాడు. ఎవరో పెద్దమనిషి. హూనావా లాంగ్ కోటు, సేలంజరీపంచీ కండువా, పట్టెడు మీసాలూ రాళ్లుపొదిగిన గుండీలు, జేబులో వాచీగొలుసు రవ్వలవుంగరాలూ ఐశ్వర్యాన్ని తీవినీ వెల్లడిస్తున్నాయి. ఆయన్ని నిన్నెక్కడో చూచినట్లు శివరావుకు అనిపించింది. 'ఏహోటల్‌కు బాబు?' అన్నాడాయన. 'వెల్‌కం హోటల్‌కండి' అన్నాడు సవిన యంగా. "అయితే సరే నేనూ అక్కడకే" అంటూ కామేశ్వరంగారు ఖత్తు కలిపారు.

విజయవాడ హిగ్గిన్‌బాదంసు దగ్గిర పత్రిక కొంటూవుంటే చూచినప్పుడే శివరావు స్ఫురద్రూపం కామేశ్వరంగార్ని ఆకర్షిం చింది. 'అందగాడేను' అనుకున్నారు తప్ప అంతకుమించి వూహించలేదు. నిన్న ప్రొద్దుట సికంద్రాబాద్ ప్లాట్‌ఫారంమీద టీస్టాల్ దగ్గర కనిపించినప్పుడు 'ఎవరో తెలుసుకుందా'మన్న జిజ్ఞాస కలిగింది. పలుకరిద్దామనుకుంటూ వుండగానే అతను వెళ్ళిపోయాడు. బొంబాయి వస్తున్నాడని మాత్రం తెలిసింది. బండి దిగుతూనే అను కున్నారతను కలిస్తే బాగుండునని.

అనేకమంది అనేక పనులమీద వస్తా రా మహాపట్టణానికి. కాని కామేశ్వరంగారూ శివరావు వచ్చిం దొక్కపనికే - బట్టల బేళ్ల ఖరీదుకు. పదింటికల్లా హోటల్లో భోజనం చేసి ఎవరి దారిన వారు వారి పేఢీదగ్గరకు వెళ్లేవారు. మధ్య మధ్య మార్కెట్‌లో కలిస్తే ఒక చిరునవ్వు మార్చుకోవడమే వా రంతే. రాత్రి హోటల్లో వ్యాపారం విష యాలు చెప్పుకుంటూ భోజనం చేసేవారు. వెళితే ఏదో క్రొత్తసినిమాకు వెళ్లేవారు. ఎన్నడూ మొగమెరిక లేనివాళ్ళుకూడా రైళ్ళల్లో హోటల్సులో అనుకోకుండా అతి విచిత్రంగా సన్నిహితులూ ఆత్మీ యులూ అయిపోతారు.

ఆదివారం. ఆ రోజున మార్కెట్ లేదు. ప్రొద్దుటే స్నానంచేసి కాఫీ అన్నా తీసు కోకుండా శివరావు ప్రయాణ సన్నా హంలో వున్నాడు. 'ఎక్కడికోయ్! తొందరపడుతున్నావ్?' అన్న కామే శ్వరంగారికి 'జహాంఘీర్ హాల్లో ఏదో ఎగ్జి బిషన్ వున్నదంటే చూచివద్దామని' అన్నాడు. 'అయితే మావంటి వోళ్లు బోయేస్ రాకూడదాయేం' అన్నా రాయన నవ్వుతూ. 'అబ్బే అదేం లేదండీ కలిసే వెడదాం రండి. మీరు వస్తారో రారో అని పిలవలేదంతే' అన్నాడు శివరావు మర్యా దగా. ఇద్దరూ 'ఓపెన్ ఎయిర్ హోటల్'లో కాఫీ తీసుకుని టాక్సీమీద మ్యూజియంప్రక్కనవున్న ఆ హాలుకు వెళ్లారు.

దేశదేశాల కళాకారులు తీసిన ఫొటోలు గోడలమ్మీదా స్టాండ్సుమీదా టేబిల్సు పైనా చాలా చక్కగా ఎగ్జిబిట్ చేశారు. సామాన్యమైన ప్రకృతినీ మానవ దైనిక జీవిత స్ఫులింగాల్నీ తీసుకుని అంత వుత్తేజ కరంగా వెలుగు నీడలలోకి మార్చిన కొందరి ప్రతిభావంతుల ఫొటో రచన 'లహో!' అనిపించాయ్. అవన్నీ చూశాక కెమేరాను క్లిక్ మనిపించడమంత తేలికకాదని తేల్చు కున్నారు.

హాలంతా చుట్టివచ్చేటప్పటికి పన్నెం డయింది. అప్పటికే కడుపులో స్వామి వారు నివేదనకు తొందరించారు, కామేశ్వరంగారు 'పురోహిత హోటలుకు వెడదా'మంటే, 'అనవసరం ఖర్చెందుకు లెస్తురు' అని అనడం అనేశాడు కాని తరు వాత ఆయనేమనుకుంటారో అని పస్తా యించాడు శివరావు. ఆయనేమీ అనుకో లేదు. పుర్రాడిలో కావలసిన కుడుమున్నం వుండని సంతోషించాడు.

స్నేహితులతో సహా హోటల్ బిల్ ఏడు ముప్పావలా వెయిటర్ టిప్ పావలా వెరసి ఎనిమిది రూపాయలూ కామేశ్వరంగారే చెల్లించారు. అక్కడ్నించీ 'గేట్ వే ఆఫ్ యిండియా'కు వెళ్లారు. చల్లని సముద్రపు గాలి క్రొత్త వుత్సాహాన్ని నింపింది. కామేశ్వరంగా రడుగుతూవుంటే శివరావు కుటుంబవిషయా లొకటొక్కటిగా అన్నీ చెప్పాడు.

నీరెండ జారకుండా మలబార్ హిల్సుకు వెళ్లారు. ఆదివారంనాడది ఆనందానికి ఆస్థానం. చల్లని లతామండపాలు, అందంగా ఆకుల్తో తీగల్తో తీర్చిన మృగ పక్షి స్వరూపాలూ, కృత్రిమగిరి కందరాలు, మలిపిన సెలయేళ్లు జలయంత్రాలు కలకలాడతాయి ఆ రోజున. బూట్ హవుస్ కుర్రకారుకు గుత్తకిచ్చినట్లే కొండమీద జన సముద్రం. కొండక్రింద నీలాకాశాన్ని చుంబించే సౌధ శిఖరాల్ని ప్రతిబింబిస్తూవున్న విశాల సముద్రం.

దీపాలు వెలిగించే వేళకు 'జుహూ' తీరానికి చేరారు. సముద్రం వారనే యిసుకమీద చిన్న చిన్న ఒడ్డీలు పెట్టుకుని పెట్రోమాక్సు వెల్తుర్లో ఫలహారాలూ, పానీయాలూ, పాన్ సుపారీ, చివరికి మంచినీళ్లూ అన్నీ అమ్మబడతాయి లోభివాని భాగ్యంలా ప్రక్కనే వున్న సముద్రజలం ఎవ్వరికీ పనికిరాదయ్యె. యువ దంపతులు నవ దంపతులు బ్రహ్మచారులు వేదాంతులు ద్వైతులు అద్వైతులు ఆడా మగా అనకుండా వస్తారు దీపాలు పెట్టే వేళకు. బొంబాయి తొందరలోతనమీద నాలుగు గోడల మధ్యా దొరకని స్వేచ్ఛా ఆనందం దొరుకుతుందక్కడ. శివరావుకు శివరాత్రి తిరునాళ్లు గుర్తుకు వచ్చాయి అక్కడ తిరుగుతున్నంత సేపూ.

తాజ్‌లో రెండో ఆటచూచి హోటల్ చేరుకునేటప్పటికి పన్నెండయింది. ఒక గ్లాసుడు మంచినీళ్లు త్రాగి కాళ్లు చాపుకుని పడుకున్న కామేశ్వరంగారికి శివరావు చెప్పిన సంగతులు గుర్తుకు వచ్చాయి.

తండ్రి ఒక మిల్లులో గుమాస్తా. తల్లి జబ్బు మనిషి. ఇద్దరు చెల్లెళ్లున్నారు మెడమీద కత్తుల్లా, పెళ్ళికి పిలిచి పిల్లనిస్తామంటే అల్లుడి హోదాతో అట్టబొమ్మ కూడా కట్న మెంతని కళ్లెర్ర చేస్తూవుంది. తండ్రి కొడుకుల జీతాలు హానిహానిగా సరిపోతాయి. చెల్లెళ్ల పెళ్ళి చేసిం తిరువాత తన విషయం—శివరావు అట్టబొమ్మ కాదు గట్టి బొమ్మే అనుకున్నాడు కామేశ్వరం గారు తనలో తనే నవ్వుకుంటూ.

రెండు మూడు రోజుల్లో బొంబాయి పని చూచుకుని అహమదాబాద్ వెళ్లారు. అక్కడి ఖరీదు రోజు పూటలో అయిపోయింది. కామేశ్వరంగారి బలవంతంమీద శివరావు మవుంటాబూకు బయల్దేరక తప్పలేదు.

దిల్వేరా పర్వత శిఖరాలమీది పాలరాతి దేవాలయ శిల్పం పరమాద్భుతమనిపించింది శివరావు హృదయం రసప్లావిత మయింది. మీగడపాలు చిలికినట్లున్న ఆ చంద్రకాంత శిలాఫలకాలమీద శిల్పుల భావా లల్లిబిల్లిగా అల్లుకున్న తీగలై ఆకులై పూలై పిందెలై చిరంజీవములైన రేఖలూ, సర్వోత్తమ కళాఖండాలుగా చప్పరాల్లో తీర్చిన శతపత్రాలూ, గాయనీఘటిత గజాశ్వ బంధాలూ, శారదా నృసింహమూర్తి ప్రముఖ రూపకల్పనలూ, శాంతరసముద్రితులైన జినదేవులూ, చక్కని స్తంభశిల్పాలూ, ద్వారతోరణాలు, ముంజూరుల క్రింది ఆధార శిలా ఫలకాలమీది మదగజ మృగేంద్ర విన్యాసాలూ కామేశ్వరంగారికి చూపించి విశేషాలు చెప్పాడు శివరావు. “శిల్పం రెండు రకాలు మహాశిల్పం, ఖండశిల్పమని. ఎల్లోరా శ్రావణ బెల్గోలా మొదలైన చోట్లవి మహా శిల్పాలు. బేలూరు, మధుర, అబూ మొదలైన చోట్లవి పరిమితమైన ఖండ శిల్పాలు. మాటవరుసకు తాజమహాల్ని దాని అద్భుత నిర్మాణపథకానికి అంతకన్నా ఒక మహోత్తమ ప్రేమస్మృతి చిహ్నంగా నెలకొల్పిన తియ్యని తలపునకూ జోహారు చేస్తాం. ఇక్కడిలా అక్కడ ప్రత్యంగుళం కళాలక్ష్మి కస్తూరితిలకంలా గుబాళించదు. అవి సముద్రాలు. ఇవి జీవనదులు.' శివరావు గంభీరవాణి కామేశ్వరం గారి చెవుల్లో అమృతం వర్షిస్తూవుంది. 'గజం బద్దా కత్తెరా పుచ్చుకుని కసరత్ చేసే మామూలు గుమాస్తా కాదు. విజ్ఞానం చక్కని సంస్కృతి కళాప్రియత్వం వున్నవాడు' అనుకున్నాడు శివరావును అంచనాకడుతూ కామేశ్వరం గారు.

కామేశ్వరం గారికి కొండగాలి పడలేదు. అహమదాబాదు వస్తూనే సుస్తీ పడ్డారు. ఆయనకు జ్వరంవస్తే అశ్వమేధమంత పని జరుగుతుంది. కలవరింతలే కావు కాళ్ల నొప్పులే కావు అన్నీ అపసోపాలూను.

మొదట్లో శివరావు భయపడ్డా వెంటనే డాక్టర్ని పిలుచుకువచ్చి అవసరమైన యింజెక్షన్ యిప్పించాడు. రెండురోజులు నిద్రాహారాలు లేకుండా మంచంప్రక్కనే కుర్చీ వేసు కూర్చున్నాడు - కన్నీళ్లు తుడిచాడు - కాళ్లు వొత్తాడు - మందు త్రాగించాడు - మనసుకు ధైర్యం చెప్పాడు. మూడవనాటికి కామేశ్వరంగారు తేరుకున్నారు. మరో రెండురోజులు విశ్రాంతి తీసుకున్నారు. ఒకరోజున సబర్మతికి వెళ్లారు. చిలకలేని పంజరం. అహింసాసిద్ధాంతి బాపూజీగదిలో సాలీళ్లు గూళ్ళల్లుకొని కూర్చున్నాయి వలలో చిక్కిన ఈగల్ని పట్టి ఫలహారం చెయ్యడానికి.

మర్నాడుదయం హాల్తామినార్ చూచి వచ్చారు దాన్ని గజినీ ఒక్కసారి వెయ్యిమంది నమాజ్ చేసుకోడానికి వీలుగా కట్టించాడు. ఆ మస్జిద్ ముందు రెండు మీనార్లు (స్తంభాలు) వున్నాయి. వాటిలోపలి మెట్లమీదనుంచి ముప్పై అడుగులు పైకెక్కి పైనున్న కొద్దిపాటి వరండాలో నిలబడి ద్వారబంధాన్ని పట్టివూపితే వుయ్యాలలూగుతుంది. బ్రిటిష్ యింజనీర్లు నిర్మాణరహస్యం తెలుసుకోవాలని ఒకదాన్ని రెండంతరాల వరకూ పడగొట్టించారు; వారేం తెలుసుకున్నారోగాని చేసినపనికి సాక్షిగా తల తెగి మొండెం మిగిల్చుకొందొక మీనార్.

శివరావు విద్యావినయాలు వ్యవహార సరళి పదిరోజులపాటు కలిసీ మెలిసీ వుండడంచేత అలవాట్లూ అన్నీ కామేశ్వరంగారికి తెలిశాయి అతనిమీద కలిగిన అభిప్రాయం అభిమానమై అల్లుణ్ణి చేసుకోవాలనుకోవడానికెన్నాళ్లో పట్టలేదు. ఎన్నాళ్లనించో వెదుకుతూవున్న అల్లుడు శివరావులో ప్రత్యక్షమయాడు కామేశ్వరంగారికి.

ఊరికి బయల్దేరేరోజున శివరావు 'మీ వూరికి నేనెందుకండి' అని అంటూవున్నా విడిచిపెట్టలేదు రెండుటిక్కెట్లు తీసుకున్నారు కామేశ్వరంగారు.

రైలు దిగీ దిగకముందే 'నాన్నగారూ!' అంటూ ఆప్యాయంగా నాగమణి దగ్గరకు వచ్చింది. కామేశ్వరంగారు కూతురి తల నిమురుతూ ప్రక్కనే వున్న శివరావును చూపించి, 'ఈయన మనవాడే. ప్రయాణంలో కలిశారు. చాలా సరదాగా గడిచిపోయిం దీసారి ప్రయాణం. మరిపోయా. అహ్మదాబాద్‌లో నాకు సుస్తీ చేస్తే యీయన ఎంత సేవచేశా రనుకున్నావ్' అంటూ పొగడుతూవుంటే శివరావు సిగ్గుపడ్డాడు. తండ్రి కళ్ళల్లో నిండిన కృతజ్ఞత ను చూసి నాగమణి చేతులు జోడించి 'నమస్కారమండి' అంది. శివరావు ప్రతి నమస్కారం చేశాడు. ముగ్గురూ కార్లో యెక్కి యింటికి వెళ్ళారు.

శివరావు వూహించుకున్న దానికన్నా యిబ్బడి ముబ్బడిగా వున్నాయి కామేశ్వరంగారి భోగభాగ్యాలు. జమీందారీ ఫాయాగా నడుస్తూవుంది వ్యవహారం.

'ఏమండి! మీరు కథలు వ్రాస్తారుటగా, నాన్నగారు చెప్పారు. నాకు కథలంటే చాలా యిష్టం' అంటూ తనకు నచ్చిన కథల పేర్లూ, కొన్నింటి ముగింపుల్లో

[illegible]కలసిన మార్పులూ, కొందరి రచయితల ప్రత్యేకతలూ, చెప్పుకుంటూపోయింది అతని జవాబుల కాశించకుండానే నాగమణి. శివరావా అమ్మాయి కలుపుగోలుతనానికీ కథల మోజుకీ ముచ్చటపడ్డాడు.

వచ్చిన మర్నాడొక్కసారి కామేశ్వరంగారితో షాపుకు వెళ్ళి వచ్చాడు. అంతే; వున్న రెండు రోజులూ నాగమణి తీరికలేని కార్యక్రమం ఏర్పాటుచేసింది.

హార్బరు, యూనివర్సిటీ, పిచ్చాసుపత్రీ, జింతప్పని కార్ఖానాలూ అన్నీ చుట్టి వచ్చి చివరకు బీచివొడ్డున పిచ్చాపాటి కబుర్లు చెప్పుకున్నారు మర్నాడు కామేశ్వరంగారితో సింహాచలం వెళ్ళారు. తండ్రీ శివరావూ మాట్లాడుతూ నెమ్మదిగా మెట్లెక్కుతూ వుంటే నాగమణి లేడిపిల్లలా చెంగున దుముకుతూ పోయి పయినించీ తండ్రిని రమ్మని చెయ్యూపుతూ వుంటే కూతురి చిలిపితనానికి తండ్రి హృదయం వుప్పొంగేది.

"తల్లి చాలా చిన్నతనంలో పోయింది. అప్పట్నించీ రొమ్మున పెట్టుకుని పెంచా. చాలామంది మళ్ళీ పెళ్లి చేసుకోమని హితబోధ చేశారు కాని నా కిష్టంలేకపోయింది. లోకంలో ఎందర్ని చూడ్డంలేదు సవితి తల్లి పెట్టే అగచాట్లనుభవించేవాళ్ళని. నా బిడ్డకూ అంతే గతి—" ఆయన గొంతుకలో మాట విషాదంలో పెగల్లేదు.— "చక్కని అభిరుచులున్నాయి. స్కూల్ ఫైనల్ చదువుతూవుండి రెండేళ్ళ క్రితం నుంచీ ఎన్నో సంబంధాలు చూస్తున్నా. నచ్చింది కలిసిరాలేదు, ఇంతవరకూ. నాకు కూతురైనా కొడుకైనా అదేను దాన్ని ఒకయ్య చేతిలో పెట్టి అతని కీ భారం అప్పజెబితే చాలునాపని తీరిపోతుంది." అంటూ వుంటే ఆయన కళ్ళల్లో అశ్రువులు మెరిశాయి. ఎదురొచ్చిన నాగమణి 'ఏమండీ నాన్నగారూ! కళ్ళల్లో ఏదైనా నలుసు పడిందా' అంటూ జాలిపడింది. 'నిన్నొకయ్య చేతిలో పెట్టాక కాని యీకంటిలో నలుసుపోదు మీనాన్నగారి' కనుకున్నాడు శివరావు తనలో.

శివరావుకు స్వామి తీర్థప్రసాదాలకన్నా కొండపాదున వింజామరలు వేస్తున్న పిల్లని పూలగాలులూ ఆపచ్చని ప్రకృతి వైభవం గలగలలాడుతూ సాగివచ్చే కొండ వాగులూ మనస్సులో నిల్చిపోయాయి పిల్లలు కావలసినవారు ఫీజిచ్చి కౌగిలించుకో వలసిన గుళ్లో స్తంభాన్ని గురించి చెప్పుకుని నవ్వుకున్నారు శివరావు నాగమణి

నాగమణి కమ్మగా వీణవాయిస్తూవుంది. నవకవుల గేయాలు చాలావాటికి స్వరం సమకూర్చుకుని సాధన చేసింది. నండూరి వారి 'దూరాన నారాజు కే రాయడో నో' అన్నపాట పలికిస్తూవుంది. నాదమాధుర్యాలు వాయుతరంగాలమీద రాయంచల్లా రువాళిస్తున్నాయి. శివరావుకు గుండెలు గొంతుకలో కొట్లాడినట్లున్నాయి.— 'తులిసెమ్మ పొరిగింది తొలిపూస పెరిగింది మనసులో నాబొమ్మ మసకమసకేసింది—' ఆ చరణాలే గొంతుకలో నర్తిస్తున్నాయి. భారతీయకవులు సృష్టించిన చిరవియోగవతీ విధురాకృతి కళ్ళముందు నిలిచింది. సీత, ఊర్మిళ, శకుంతల, రాధ, వరూధిని, ఊర్వశి, ఎంకి అందరూ ఆకోవలోనివారే. అతనికి సుభద్ర జ్ఞాపకం వచ్చింది. కళ్లు చెమ్మగిల్లాయి.

అక్కడున్న మూడురోజులూ డబ్బువల్ల సమకూడే సుఖానుభవాలు రుచి చూరగలిగాడు శివరావు. వెళ్లేరోజున క్రొత్తబట్టలు కట్టబెట్టారు. తనకు పనుందంటూ శివరావుతో కామేశ్వరంగారుకూడా బయల్దేరారు. నాగమణి స్టేషన్‌కు వచ్చింది. రైలు కదిలే అంతవరకూ శివరావుతో ఏదో మాట్లాడుతూనేవుంది. రైలుకదిలి కంటికగుపించేంతవరకూ చెయ్యి వూపుతూ వీడ్కోలిస్తూనే వుంది.

నాగమణి కార్లో యింటికి వెడుతూవుంటే రాత్రి సంగతి తలపుకువచ్చింది - తండ్రి తనగదిలోకి వచ్చి 'ఏమమ్మా నచ్చినట్టేనా?' అని నవ్వుతూ అడిగారు. తాను 'పోండీ, నాన్నగారూ' అని గారాంపోయింది. 'పెళ్లి చేస్తే నువ్వేపోతావుగా' అంటూ నాన్నగారు నవ్వుకున్నారు. తను సిగ్గుల పెళ్లి కూతురయింది. అది తలుచుకుంటున్న ఆమె చెక్కిళ్లు చెంగలువలయాయి. నాన్నగారు సంబంధం ఖాయం చేసుకురావడానికే వెడుతున్నారనుకుంది.

కామేశ్వరంగారు సరాసరి శివరావుతో అతనింట్లోనే దిగారు. తను బీదతనాని కడుగడుగునా శివరావు సిగ్గుపడుతూనేవున్నాడు. కాని కామేశ్వరంగా రివేమీ పట్టించుకోలేదు. భోజనాలయాక పందిట్లో వేసిన మంచాలమీద కూర్చుని శివరావు తండ్రి చలపతీ, కామేశ్వరంగారు ఆ సంగతి యీ సంగతి మాట్లాడుకుంటూ వుంటే వంటిల్లు దక్కబెట్టుకుని మహాలక్ష్మమ్మ వచ్చి గుమ్మాని కానుకుని నిల్చింది. 'రండక్కయ్యగారు! మీకోసమే చూస్తున్నా' నంటూ కామేశ్వరంగారా దంపతులతో తను వచ్చినపని చెప్పారు.

చలపతి అనుకోని యీ అదృష్టాని కానందించాడు. కాని చేతికందిన కొడుకు నిల్లరికాని కివ్వడమవుతూవుందన్న బాధ ముల్లుగర్రలా గ్రుచ్చుకుంది. అతను వ్యవహర్త. 'ప్రొద్దుట ఆలోచిద్దాంలెండి మీరు ప్రయాణపు బడలిక తీర్చుకోండి' అని మాట మార్చాడు.

తల్లికి సంతానంమీద వున్న మమకారం దేనిమీదా వుండదు. శివరావు తల్లికిది అసలు నచ్చనేలేదు. ఒక్కగాని ఒక్క కొడుకు తన కిడమైపోతాడంటే సుతరాం సమ్మతించలేదు. అయినా అన్నదమ్ములే నచ్చచెప్పాక చివరి కామె సరే లెమ్మంది. శివరావు కిదంతా ఇంద్రజాలంలాగా వుంది. నాగమణితో అంత కలిసి మెలిసివున్నా తానాయింటల్లుడు కాబోతాడన్న వూహే లేకపోయింది. కామేశ్వరంగారి కృతజ్ఞతా ప్రతిరూపమే ఆ మర్యాదంతా అనుకున్నాడంతే.

శివరావు హృదయంలో వున్న సుభద్ర 'ఏమోయి శివం! నువ్విల్లా మన్ను తిన్న పాములావుంటే ఎలా ఒకచెంపనించి ముంచుకొస్తూవుంటే - ఈ పెళ్లి జరగడానికి వీల్లేదని చెప్పెయ్' అంటూ వుంది. శివరావు తండ్రితో చెప్పాడు 'నాకీ పెళ్లి వద్దు నాన్నా' అని చలపతి 'ఎందుకని?' అని అడగనే అడిగాడు. 'మన సంగతి చెప్పవోయ్ శివం' అన్నది లోపలి సుభద్ర. కాని శివరావుకు తెలుసు అది గనుక చెపితే చిన్న కురుక్షేత్రం ఏర్పడుతుందని - తెలివిగా తప్పుకున్నాడు. 'ఇల్లరికం వెళ్ళడం ఇష్టంలేదు నాకు' అంటూ తండ్రికి నచ్చచెప్పబోయాడు 'అసలే కుంటినడకలు నడుస్తున్న కుటుంబం తను వెడితే కుదేలు పడిపోతుం'దని. కామేశ్వరంగారు ఆడపిల్లలిద్దరికీ పెళ్ళిళ్లు చేయించి తన దెబ్బా పచ్చా చూస్తానని హామీ యిచ్చిన సంగతి చెప్పాడు చలపతి. ఇది విన్నాక శివరావుపని అడకత్తెరలో పోకచెక్క అయింది.

"ప్రేమించి పెండ్లికి మాటిచ్చిన సుభద్ర కన్యాయంచేసి డబ్బు కమ్ముడు పోతున్నానే" అనీ—"ఇదేనా ప్రేమంటే! అవాంతరాలెన్ని వచ్చినా ప్రేమికుడు ధైర్యంగా ఎదుర్కొని నిలబడాలి కాని" అంటూ ఒకభావం "పిచ్చివాడా! నువ్వు నీ కుటుంబ క్షేమంకోసం నీ ప్రేమను త్యాగం చేస్తున్నావంటే ఎంత గొప్ప విషయమో తెలుసా? నువ్వు సుభద్రను చేసుకుంటే అయ్యా నీ స్వార్థం తప్ప అందులోవున్న విశిష్టత ఏమిటి?" అని మరోభావం "ఛీ మూర్ఖుడా! నిన్నునమ్మి నీ కాత్మార్పణం చేసిందే; ఆ పిల్లగతేమి

కాను నీ దారిన నువ్వుపోతే? సుభద్ర మొన్న నీతో చెప్పిన రహస్యం మర్చిపోయావా?" వేరొక మందలింపు. ఆ రహస్యం తెలుసుకునేటప్పటికి శివరావు ప్రాణాలు గిలార్చుకుని పోయాయి. 'అన్నయ్యా! ఇన్నాళ్ళకు మాకన్నె చెర తీరేకాలం వచ్చింది. నువ్వు వూఁ అంటే చాలు అన్యాయం చేస్తావా మమ్మల్ని" అంటూ దీనంగా యాచిస్తున్నారు చెల్లెళ్లు. ఇల్లా రకరకాల భావాల్లో నలిగిపోయిందతని వ్యక్తిత్వం. దైవానికి దణ్ణం పెట్టి తాను సాక్షిగా నిల్చున్నాడు శివరావు.

పెళ్ళి చాలా వైభవంగా జరిగింది. కామేశ్వరంగారు కట్నం క్రింద పదివేలు చదివించి చలపతి చేతిలో పోశారు. శివరావు ఎరువు తెచ్చుకున్న చిరునవ్వుల్తో మూడు రోజులూ ముళ్ళమీద ఉన్నట్టున్నాడు.

శివరావు చెల్లెళ్ళిద్దరికీ ఆ వైశాఖంలోనే పెళ్ళిళ్ళయాయి. సొంతయిల్లంటూ యేర్పడింది. కాలవక్రింద రెండెకరాలు కొని తన పేర వ్రాయించుకున్నాడు చలపతి. శివరావు కిది కొంచెం ఓదార్పయింది.

అతను శివకామేశ్వర ప్రసాదరావయ్యాడు. పదహారు రోజుల పండుగ వెళ్లక ముందే అతని చేతికి కొట్టు తాళాలప్పగించి 'అమ్మయ్య!' అనుకున్నారు కామేశ్వరం గారు. తలతిరక్కుండా గుమాస్తాల అభిమానాన్నీ ఖాతాదార్ల విశ్వాసాన్నీ సంపాదించుకున్నాడు. గురి తెలిసినవాడి చేతి బాణంలా వ్యాపారం అడ్డులేకుండా సాగిపోతూ వుంది.

పెండ్లయిన ఏడాదికి బ్లడ్ ప్రషర్ వల్ల మనుమణ్ణెత్తుకోవాలన్న కోరిక తీరకముందే కామేశ్వరంగారు కన్నుమూశారు. ఇవ్వేళ యీ సర్వసంపదకు అధికారి శివరావు.

శివరావు ఆలోచనల్లోనించి ఒక వొడ్డుకు చేరాడు. అతని ముఖంలో కారుణ్యం విప్పారింది. మెల్లిగా టవల్ మడతల్లో వున్న ఆ పిల్లాడ్ని చేతుల్లోకి తీసుకున్నాడు. నాగమల్లి మొగ్గల్లాంటి ఆ పాల పెదవులు ముద్దులూరిస్తున్నాయి. ముద్ద మందారాల్లా బుగ్గల్ని ముద్దు పెట్టుకోవాలనుకున్నాడు. "నిద్రపోతున్న పిల్లల్ని ముద్దు పెట్టుకో కూడ"దన్నది ఎప్పుడో విన్నాడు. ఆ పసివాణ్ణి హృదయానికి హత్తుకున్నాడు. ఆ అమృత స్పర్శకు అతని సందేహాలన్నీ పటాపంచలైనాయి. చంద్రబింబంలాంటి ఆ ముఖం చూస్తూవుంటే మనస్సు పాలసముద్ర మయింది. కన్నులు చంద్రకాంతాలైనాయి. బాబు నెత్తుకుని మెల్లిగా మెట్లెక్కి మేడమీదికి వెళ్లాడు; 'కథ ఎల్లా సుఖాంతం చెయ్యాలా' అనుకుంటూ.

నాగమణి అప్పుడే భోజనం చేసింది. గదిలో సోఫాలో కూర్చుని ప్రక్క టీపాయ్ మీద ట్రేలో వున్న నల్లద్రాక్షపళ్లు ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూ పత్రిక చదువుకుంటూ వుంది. పైన తిరుగుతూవున్న ఫాన్ గాలికి కదిలే ముంగుర్లు నెలవంకలా వున్న ఆమె నెన్నుదురిమీద మబ్బురేకల్లా వున్నాయి. చిక్కడం కూడా చక్కని వాళ్ళ కందమే అన్నట్టుంది నాగమణి. అడుగుల చప్పుడు విని తల త్రిప్పింది. భార్యాభర్తల చూపులు పాలుగయాయి. భర్త చేతిలో పూల పొట్లంలా వున్న పసిపిల్లణ్ణి చూసి 'ఎవరు చెప్మా' అనుకుంది. 'ఎవరి పిల్లడండీ?' అని అడిగింది.

'మన పిల్లాడే' అన్నాడు శివరావు, తన చూపుల్ని భార్య చూపుల్తో కలపలేక క్రిందికి వాలుస్తూ. 'అంతఅదృష్టమా!' అనుకుంది ఆమె స్త్రీ హృదయం. పిల్లాణ్ణి నాగమణి ప్రక్క సోఫాలో పడుకో పెట్టాడు సుతారంగా. ఆ పసిమొగ్గ ఆమె హృదయాన్ని గిలిగింతలు పెట్టాడు. 'బాగున్నాడెవరి పాపాయో, పుణ్యంకొద్దీ పురుషుడూ దానం కొద్దీ బిడ్డలూ' అన్నది నాగమణి. 'నువ్వు నాకోసం పుణ్యం ఖర్చు పెట్టకుండానే దొరికానులే. ఇప్పుడే దానం చెయ్యకుండానే వీడు వచ్చాడు మణీ!— అభయప్రదానం మాత్రం చెయ్యాలి' అన్నాడు శివరావు.

"అన్నీ వేళాకోళాలు నన్నాడిస్తున్నారు."

"కాదు నా మాట నిజం. కన్నవాళ్లే అప్పగించి వెళ్లారు"

"చందనపు బొమ్మలా వున్న కుర్రాడ్ని ఇతర్లకివ్వడానికే తలిదండ్రులకు ప్రాణం వొప్పుతుందండీ!"

"అందుకు చాలా కథవుంది."

"కథలెందుకు లెద్దురు, ఉన్న సంగతి చెప్పరడి."

"కొన్ని వాస్తవాలే కథలకన్నా కష్టంగా వుంటాయి."

"అట్లా అయితే అబద్ధాల్నే నిజాలుగా నమ్మిస్తూ నేర్పుగా కథలల్లుతారు. మా వారిలాంటివారవునా?" అంటూ శివరావు ముఖంలోకి చిరునవ్వులు చిలికింది. "పోనీ, ఏదోఒకటి చెప్పండి నాకు ప్రొద్దుపోతుంది" అన్నది సంధిచేసుకుంటూవున్నట్లు.

శివరావు కథ ప్రారంభించాడు. 'అనగా అనగా' అని. ఆదిలోనే హంస పాదుగా 'అంత మరీ కాశీ మజిలీలోలా ప్రారంభిస్తారేమిటి, కథ కాదంటూ' అంది నాగమణి వచ్చేనవ్వు పెదవుల్లో దాచి. 'సరే, విను –' తిరిగి మళ్ళీ ప్రారంభించాడు శివరావు 'ఒకబ్బాయి వున్నాడు –' అని.

ద్వితీయ విఘ్నమయింది. 'అంతకన్నా, ఒక చక్కని పన్నెండేళ్ళ బాలాకుమారి వుందంటే కథకొంత ఆకర్షణ వొస్తుం'దన్న మణి సవరణతో. ఆమె కళ్లల్లో చిలిపితనం తొంగి చూస్తూ వుంది. అతనికీ నవ్వు వచ్చిందికాని కోపాన్ని నటిస్తూ 'మధ్య మధ్య నీతుడుపుల్తో కథ సాగినట్టే. నేను చెప్పనులే' అన్నాడు. 'ఇక చెప్పండి మాట్లాడకుండా వింటాను సరా' అన్నది బుజ్జగిస్తూ బుద్ధిమంతురాలులాగా.

శివరావు చెప్పుకుపోతున్నాడు – కాంతమ్మగారికి ఒక కొడుకూ ఒక కూతురు. మొదట్లో వాళ్లది ఆస్తిపాస్తులున్న సంసారమే కాని భర్త దుబారాతనంతో అంతా హారతికర్పూరంలా హరించుకు పోయింది. భర్త పోయింతర్వాత మిగిలిన నగా నట్రా సొమ్ముచేసి ఆ వడ్డీతో కుటుంబాన్ని గుంభనగా లాక్కువస్తూవుంది. కొడుకు జగన్నాధము కూతురు సుభద్రా చదువూ చక్కదనముతో తల్లిదుఃఖాన్ని మరిపించేవారు. తన పిల్లలే తనకు పెన్నిధులనుకుంటూ ఆ పేదరాలుకూడా స్థిమితపడింది.

జగన్నాథానికి వచ్చిన నేస్తం బాబులు. అతని అసలుపేరుకన్నా కొసరు పేరు 'బాబు' అన్నదే వాడుకయింది ఇంటా బయటా. బాబులెప్పుడూ కాంతమ్మ గారింట్లోనే ఆడుకుంటూనో చదువుకుంటూనో ప్రొద్దుపుచ్చేవాడు. ఆ స్నేహితులిద్దరితోపాటు సుభద్రా ఆటపాటల్లో కలిసిపోయేది. చిన్నప్పుడు సుభద్ర పిచ్చుకగూళ్లు కట్టుకోడానికి యిసుక తెచ్చిపోసే బాబులు ఫిఫ్తుఫారంలో సుభద్రకు తెలియని పాఠాలు చెపుతూంటే కాంతమ్మగారు ముచ్చటపడేది. సుభద్ర బాబుల కారవప్రాణం. బాబులొక్కపూట రాకపోతే సుభద్ర హృదయం తపించిపోయేది. తల్లి నవ్వుకొనేది.

ఇంటర్ సెకండియర్ చదువుతూవుంటే జగన్నాధానికి రెండు రోజులు జ్వరంతగిలి 'అదే తగ్గుతుంది లె'మ్మన్న అశ్రద్ధతో చివరికి టైఫాయిడ్‌లోకి దింపింది. కాంతమ్మగారికి కాలూ చెయ్యీ ఆడలేదు. బాబులు డాక్టర్ని పిల్చుకువచ్చాడు. డాక్టరు చదువుకున్న చదువుప్రకారం రోగానికి మందిచ్చాడు కాని ఆయువు నివ్వలేకపొయ్యాడు.

జగన్నాధం చావుతో కాంతమ్మగారి గుండె నీరసించిపోయింది. సుభద్ర మూగదయింది. బాబులు స్నేహితుణ్ణి తల్చుకు కన్నీళ్ళు కారుస్తుండేవాడతని ఫొటో ముందు రోజుకొకసారైనా వచ్చి.

బాబు ఇంటర్ పాస్ చేశాడు. పై చదువుకు కుటుంబ స్థితి అంగీకరించలేదు. ఉద్యోగ ప్రయత్నాలు విసుగెత్తించాయి.

# ★ ప్రతం చెడ్డా ★

చివరికొక బట్టలకొట్లో గుమాస్తాగా చేరాడు తెలివిగలవాడు గనుక అయిదారు నెలల్లో వ్యాపారంలో అల్లుకుపోయాడు. యజమానికి నమ్మకస్థుడయాడు. ఏడాది తిరగకముందే ఇటు అమ్మకం అటు కొనుబడిలో అనుభవం సంపాదించాడు.

బాబులు గుమాస్తా పనిలో కూరుకుపోయినా కొట్టు నుంచీ వచ్చేటప్పుడో కొట్టుకు వెళ్లేటప్పుడో ఒక్కసారి సుభద్రను పలకరించి వెళ్లకుంటా ప్రాణమాగేది కాదు. కాంతమ్మగారు 'దాన్ని ఒకయ్య చేతిలో పెడితే నేనెప్పుడు కన్ను మూసినా ఫరవాలేదనేది. 'నా చేతుల్లోనే పెట్టండి' అనేవాడు బాబులు నవ్వుతూ. 'ఆ యిచ్చే కట్నాలు కానుకలూ నాకే వుంటాయి' అని.

చిన్నప్పటి స్నేహం చివురించిన అనురాగమై ఆ యిద్దరి హృదయాల్నీ ముడివేసింది. చెల్లెళ్ల పెళ్లి కావడంతోనే నిన్ను నా దాన్నిగా చేసుకుంటానని బాబులు చేతిలో చెయ్యివేశాడొక ఏకాంత సమావేశంలో సుభద్రకు. ఆమె ఆనందపరవశంతో అతని హృదయంమీద వాలిపోయింది.

మంచి చెడ్డలు విచారించడం మనవసరం ఒక దేవముహూర్తంలో ఆ పసివాళ్లిద్దరూ హృదయాలతోపాటు దేహాల్ని కూడా ఏకం చేసుకున్నారు. కాలు జారకుండానే వుండాలి, తిరువాత ఎంత కళ్లెంవేసి లాగినా పొగరుబోతుగుఱ్ఱంలా కోరిక స్వాధీనం కాదు.

బాబులుకు సుభద్రకు వివాహమవడం అంత కాని విషయం కాదు. రెండు కుటుంబాలు అంతంత మాత్రానివే. కాని, చివరకది కాని విషయమే అయింది.

బాబులొక జమీందారుగారి కిల్లరికం అల్లుడైపోయాడు, అతని యిష్టానికి వ్యతిరేకంగానే. సుభద్రకొక పెద్ద ఉత్తరం వ్రాశాడు తన అసమర్థతకు; అందులోనూ ఒక పచ్చి ఆశకల్పిస్తూ.

సుభద్ర కన్ను విప్పింది కాని అంతకు మునుపే నెలతప్పింది. తల్లికి చెప్పలేక చెప్పింది. కన్నంలో తేలుకుట్టిన దొంగల మాదిరి తల్లీకూతుళ్లు. ఇక ఆవూళ్లో వుండడానికి మొఖం చెల్లలేదు. ఉన్న లాడీబీడీ వెంటవేసుకొని ఎక్కడో ముక్కూ ముఖం తెలియని పల్లెటూళ్లో కాపురం పెట్టారు.

సుభద్ర బాబులు కప్పుడు సంగతులు అప్పుడు ఉత్తరం వ్రాస్తూనేవుంది. వాళ్లని లోకం ఎంత చులకనగా చూస్తూవుందో హింసిస్తూవుందో వ్రాసేది. ఈ జీవితం యింతేనా అనే ధోరణిలో వ్రాసేది బాబులుమాత్రం 'ఇప్పటున్న పరిస్థితులిలానే వుండవనీ, సమయం వస్తే అన్నీ చక్కబడతాయనీ ఆ పుట్టబోయే సంతానానికన్యాయం చెయ్యవద్దనీ వ్రాసేవాడు మొదట్లో. తరువాత తరువాత ప్రతిఉత్తరానికి జవాబు వ్రాయడంకూడా బద్ధకమయిందతనికి.

పిల్లాడు పుట్టినప్పుడెంతో సంతోషిస్తూ ఉత్తరం వ్రాసింది. అన్నీ అతనిపోలికలే అని పిల్లడు కుందనపు బొమ్మలా వుంటాడని. తనతల్లి అల్లుడు దూరదేశంలో వుద్యోగంలో వున్నాడని ఇక్కడ అందరితో చెప్పిందని, ఒక్కసారి వచ్చి బాబును చూచి వెళ్లమని. సుభద్ర వ్రాసిన ఆవుత్తరంకూడా అన్నిటితోపాటు ముక్కలుముక్కలై తుక్కుబుట్టలో పడిపోయింది.

సుభద్ర వ్రాసిన ఆఖరువుత్తరంలో మాత్రం కొడుకుపోయిన విచారమే కాకుండా కూతురి దుర్దశకుండెలమీద రగిలించిన కుంపటై చివరికి తనతల్లి చచ్చిపోయిందని, ఇన్నాళ్ళూ అండగావున్న అమ్మచావుతో తన బ్రతుకు బజారుపాలైందని, ఇన్నాళ్లూ ఏనాటికైనా బాబులు వచ్చి తన్నూ బాబును తీసుకువెడతాడన్న ఆశవుండేదనీ అదీ యికలేదనీ, ఇల్లా యీ లోకంలో తనలాటిది బ్రదకడం కష్టమనీ తనే ట్రయినింగయ్యి ఏహాస్పిటల్లోనో నర్సుగా చేరిపోతాననీ పిల్లడ్ని బాబులందుకొని ఆదరించినా కాదన్నా అతని గడపలో వదిలి వెడతానని ఏమేమిటో వ్రాసింది. పాపం ఆ అమ్మాయి నెంతాడిపోసుకొందో లోకం!

బాబులు సుభద్రదగ్గిరికి వెళ్లి నచ్చచెప్పడమో వెంటపెట్టుకురావడమో చేసేవాడే అతని భార్యను వొప్పించి. కాని అప్పుడే ఆ భార్యకు సుస్తీచేయడం, ఆ అవస్థలో అతను కాలు కదల్చలేకపోయాడు. సుభద్ర అభిమానవతి బాబును తీసుకువచ్చి అతని గడపలో పెట్టే వెళ్లింది. శివరావు నిట్టూర్పు తీశాడు చెప్పడం ఆపి.

“ఆ తరువాత” అంది నాగమణి భర్తవంక రెప్ప వాల్చకుండా చూస్తూ. శివరావు ఆమెచూపులో తన చూపు కలపలేకపోయాడు. తడబడుతూ “ఏముంది అతను ఆ పిల్లాణ్ణి తెచ్చి భార్యదగ్గరుంచి—” పైమాట గొంతు పెగిలి రాలేదు శివరావుకు.

నాగమణి చెక్కిళ్లమీద కన్నీళ్లు ధారలు కట్టాయి. 'ఇదంతా మన ప్రయోజకత్వమేనా!' అంది శోకంతో. ఇన్నాళ్లూ తన భర్తనుచూచి ఎంతో గర్వపడుతూవుండేది. అంత మంచివాడెవ్వరని! - ఇంత పయోముఖ విషకుంభమని వొక్కనాడూ అనుకోలేదు. తనముందతను చూపిన అనురాగమంతా వట్టి భ్రమేనా! ఎంత బాగా నటించాడు. తను పూర్తిగా మోసపోయింది. ఇటువంటివాడికోసమేనా తన తండ్రి కోశాలన్నీ వెదికింది. ఆయనే వుంటే ఎంత బాధపడేవాడో! తండ్రి మూర్తి మనస్సులో కదలింది - 'అతని తప్పలేదమ్మా! పెళ్ళి తప్పించుకోవడానికి ప్రయత్నం చేశాడు కాని సాగలేదు. తన విధికి తలవంచుకున్నాడు తప్ప, నిన్నొక్కనాడైనా అనాదరించాడా చెప్పు! నువ్వంటే దేవతలాగా చూసుకుంటున్నాడు. అటు సుభద్రా దూరమై ఇటు నువ్వూ ఎడమైపోతే అతనేమైపోతాడు చెప్పమ్మా! క్షమించడం మంచిదమ్మా!' అంటూ తండ్రి చెప్పినట్లయింది నాగమణికి అదే గొంతుక. ఇంకా చెవుల్లో ఆ మాటలే పునరుక్తాలవుతున్నాయ్. నాగమణి కతనిమీద జాలి కలిగింది. 'అతనేం చెయ్యగలడు విధికి తలవంచాడు. తన కుటుంబంకోసం ప్రేమను బలిచేశాడు. భగ్నహృదయుడై కూడా తన జీవితానికా దావాగ్ని దరికొల్పలేదు. కంఠంలో హాలాహలం దాచుకుని తలమీద చంద్రమానును పెట్టుకున్న పరమశివుడు తన పెనిమిటి. ఆమె హృదయం జాలితో వెన్నముద్దలా కరిగిపోయింది.

అప్పటికే శివరావు నాగమణి చేతుల్లో మొగం కప్పుకుని వొళ్ళో తలపెట్టి కాళ్ళదగ్గిర కూర్చుండిపోయాడు అతని కన్నీళ్ళతో ఆమె కుచ్చెళ్లు తడిసి ముద్దయిపోయాయి 'లేవండి' అంది అశ్రుపూర్ణమైన స్వరంతో. ఆ స్వరంలో అసహ్యం - కోపం - ఈర్ష్య - బాధా యేమీ లేవు ఒక క్షమాభావం తప్ప. శివరావు నెమ్మదిగా తలయెత్తి ఆమె ముఖం చూచాడు. నిష్క

శంక మైన చంద్రబింబంలా వుంది. ఏ కొరత మబ్బు తునకలూ లేవు.

కన్నీళ్ళ చారికల్లోటి శివరావు ముఖాన్ని తన పైటచెంగుతో తుడిచింది. అతని వుంగరాల క్రాపులో సన్నని వ్రేళ్లు దూర్చి దువ్వుతూ 'పిచ్చితనం కాకపోతే ఇదివరకే చెబితే నేను కాదంటానా మీ కృష్ణావతార తత్వాన్ని" అంది నాగమణి. కెరటాల చివళ్ళ చిట్లిన వెన్నెలకాంతుల్లా అతని కన్నీటి జాలులో చిరునవ్వులు మెలిచాయి. 'నీ హృదయమింత అమృతమనుకోలేదు నే' నన్నాడు శివరావు, ఆనందం కృతజ్ఞతా అనురాగం ముప్పిరిగా. 'ఇన్నాళ్ళకు తెలుసుకున్నారు! మూ వా రెంత బుద్ధిమంతులు !' అందినాగమణి చిలిపితనంగా.

క్రింది హాల్లోనించి గల్లంతూ ఎవరివో కేకలూ వినిపిస్తున్నాయి. ఎవరో ఏడుస్తున్నారు. మధ్య మధ్య పసిపిల్లడి ప్రశంసా వస్తోంది. 'అదిగో మీసుభద్ర వచ్చినట్టుంది తమాషా చేద్దాంపదండి' అంటూ నాగమణి భర్తతో మెట్లు దిగి హాల్లోకి వచ్చింది.

వంటావిడ, తోటమాలి రాములు, డ్రయివర్ మహమ్మదల్లీ, దాసీది ఇంకా ఇద్దరు ముగ్గురు దారివపోయే దానయ్యలూ ఉన్నారు. చాకలి పద్దా లోకపెడగా కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తూ వుంది. భార్యాభర్తల కేమీ అర్థంకాలేదు. నాగమణి సుభద్ర రాలేదన్నట్టు భర్తముఖంలో చూచింది.

యజమానుల్ని చూచి కొంచెం గడబిడ తగ్గించారు. వంటావిడ చెప్పింది—'చూశారండీ అమ్మగారూ! రోజులెల్లావున్నాయో మరి పిదపకాలమైపోయింది. చాకలి పద్దాలు పురుడు పోసుకుని పుట్టింటి కాణ్ణించి మొన్ననే వచ్చింది. మీకు పిల్లణ్ణి చూపిపోదామని వస్తే మీరు భోజనంచేస్తున్నారని విని మనమెట్లదగ్గర పిల్లణ్ణి పడుకోపెట్టి తోటలో రాముల్తో మాట్లాడుతూ వుంది. ఇప్పుడు వచ్చి చూచుకుంటే పిల్లడు లేడు. మీరు చూడలేదుగాని పిల్లడు దొరలా వుంటాడమ్మా! పిల్లల్నెత్తుకెళ్లే సాధువులు తిరుగుతున్నారని వూళ్ళో అనుకుంటూంటే విన్నా—' ఆ వరసన చెప్పుకుపోతూనే ఉంది వంటావిడ. ఇంతలో మేడమీది గదిలోనించి పసిపిల్లడి ఏడ్పు వినిపించింది. అందరిముఖాలు ఒక్కసారి పైకి మళ్లేయి. నాగమణి సైగచేసింది. దాసీది పైకి పరిగెత్తి పిల్లణ్ణి చంకను వేసుకు వచ్చింది పద్దాలొక్కంగలో నిళ్ళి దాని చేతిలో పిల్లాణ్ణంగుకుంది. "ఉయ్యాల్లో పిల్లణ్ణిపెట్టి వూరంతా వెదికిందట నీవంటి యిల్లాలే" అంది వంటావిడ పద్దాల్తో పరిహాసంగా.

'నిన్ను తమాషాచేద్దా మనుకున్నాం కాని నువ్వింత గల్లంతుచేస్తా వనుకోలేదే పద్దాలూ!' అంది నాగమణి. 'చాలా బేజారయిపోయానండీ అమ్మగారూ!' అంది పద్దాలు ఇంకా దానిగుండె బెదరు సరిగా తీర లేదు. 'మేం పెంచుకుంటాం మాకిస్తావుటే పద్దాలు? అయ్యగారికి చాలా మోజుగా వుంది పిల్లడంటే' అంది నాగమణి నవ్వుతూ. 'మా బంగారుబాబుని కోటివరహాలిచ్చినా యిస్తానుటండీ' అంది పద్దాలు పసివాణ్ణి హృదయానికి గట్టిగా హత్తుకుంటూ. దాని వెఱ్ఱి ప్రేమకు నాగమణి హృదయం చలించింది; అంతకన్నా శివరావు హృదయం. 'పిచ్చి పెద్దమ్మోయ్‌రా! ఒకటి చాలకపోతే రెండు కోట్లు తీసుకు నివ్వవే' అంది వంటావిడ వేళాకోళంగా. 'కోట్లకేం తక్కువండీ, మా యింటినిండా కోట్లే' అంది చాకలి పద్దాలు. దానిమాట కందరూ ఘొల్లుమన్నారు.

నవ్వుల కలకలాన్ని మ్రింగి వేసింది ప్రక్క హోటల్ రేడియో—"ఇవ్వేళ వుదయం కలకత్తా మెయిల్ వూళ్ళ—కైకరం మధ్య పట్టాలు తప్పి పడిపోయింది. ఇంజన్ ప్రక్క రెండు మూడు పెట్టెలు, అందులో ఒకటి ఆడవారిపెట్టె బాగా దెబ్బతిన్నాయి. జననష్టం ఎక్కువే జరిగుంటుంది. క్షతగాత్రులను వెంటనే ఏలూరు హాస్పిటల్‌కు చేర్చారు. ఇంకా పూర్తి వివరాలందలేదు"

శివరావు వింటూనే ప్రక్క సోఫాలో కూలబడిపోయాడు. 'ఆకులు పట్టుకోనే టప్పటికే చేతులు కాలాయ్' అనుకుంది నాగమణి జాలిగా నిట్టూర్చి. ★




# బాలవాఙ్మయ నిర్మాతలు

ఇల్లిందల సరస్వతీదేవి

"పాపా! నిద్రవేళయింది - వెళ్లి పడుకో" అంటే "మంచికథ చెప్పితేగాని పడుకోను" అంటుంది. ఈవిధముగా అనేకమంది పాపాయిలు ఇంటింటా మారాము చేస్తుంటే తల్లులు, నాయనమ్మలు, అమ్మమ్మలు తాతయ్యలు చిత్తాకర్షకముగా - చెప్పినది చెప్పకుండా, పూటపూటకూ క్రొత్తక్రొత్త కథలను చెప్పి ఆనందోత్సాహాలను కలిగిస్తూ ఉంటారు. బిడ్డలను ఆశ్చర్యసముద్రములో మునకలు వేయించుతూ, వారి హృదయాలలో ఊహాపరంపర నుద్భవింపజేసే 'కాకి - నక్క,' 'ఆవు - పులి', 'సింహము - ఎలుక' కథలు ఈసప్ చెప్పినవి. ఈ కథలన్నీ సువిదితమైన పిట్టకథలు. 25 శతాబ్దాల కాలప్రవాహములో దొర్లి, గాలించబడి మనకు చేరినవి. ఒక్క మనకే కాదు. ఇంచుమించుగా అన్ని జాతులకూ దేశాలకూ చేరినవి.

ఈ కథల కర్తృత్వము వాస్తవముగా ఈసప్‌దేనా? అసలు ఈసప్ ఎవరు? ఏ నాటివాడు? ఈ అంశాలు అనేకసంశయాలకు దారితీసినవి, గ్రీసు దేశములో ఒకబానిస ఉండేవాడనీ ఈకథలను అతడే వ్రాసినాడనీ ఒక నమ్మకము అందరిలోను ప్రబలముగా ఉన్నది. 'సిందుబాదు కథలను సిందుబాదు చెప్పినాడన్నట్లే - ఈసప్ కథలు ఈసప్ చెప్పినవే' అనే వాదము కూడా ఉన్నది. దానికి కొన్ని సాక్ష్యములు కూడా ప్రబలముగానే ఉన్నవి. ఈ వాదాలు చారిత్రక పరిశోధకులకు సంబంధించినవి. కాని మనబిడ్డలకు కావలసినవి కథలు, తద్వారా ఆనందము.

సాధారణ జంతువులనుగురించి వ్రాయబడిన ఈ అసాధారణకథలకు తేనెలూరె రచయిత హృదయమూ, అవృద్ధుని ఆకారమూ ఇంకా జీవము పోస్తూనే ఉన్నవి. క్రీస్తుకు పూర్వము సుమారు ఆరువందల సంవత్సరాలక్రితము ప్రాచీన గ్రీసుదేశములో ఈసప్ నివసించేవాడు. ప్రాచీన చారిత్రకుడైన హిరోడాటస్, తన గ్రంథములలో ఒకచోట ఇద్మాన్‌కాలములో ఈసప్ బానిసగా ఉండేవాడనీ, కొంతకాలము తరువాత అతడి చమత్కార సంభాషణలకు ప్రభువు మెచ్చి స్వాతంత్ర్యము ఇచ్చాడనీ పేర్కొన్నాడు.

గ్రీకు మహాకవియైన హోమరు వలెనే ఈసప్ జన్మస్థానమును గురించిన అంశము వివాదాత్మకమైనది. ఆసియాలోని చాలా పట్టణాలు ఈ గౌరవాన్ని దక్కించుకోవలెనని అనేక ప్రయత్నాలు చేశాయి. క్రీస్తుకు పూర్వము 620 సంవత్సరాల క్రిందట ఫ్రిజియాలో అతడు జన్మించి ఉంటాడని కొందరు నిర్ణయించారు. క్సాంథస్ వద్ద బానిసగా ఉండి అల్పకాలములోనే ఆ ప్రభువు నాకర్షించి, అతడి దయకు ఈసప్ పాత్రుడయినాడు. ఈసప్ చతుర సంభాషణలకు ప్రభువు మెచ్చి, అతడిని బానిసత్వమునుండి విడుదలచేసి తన అంతరంగికులలో ఒకనిగా భావించాడు. ఈసప్ రూపవంతుడు కాకపోయినా రసజ్ఞుడు కనుకనే బహుజనుల నాకర్షించాడు. ఇది ఈసపు జన్మస్థానమును గురించిన ఒక వాదము.

ఆ కాలపు మరొక చారిత్రకుడయిన ప్లూటార్కు ఈసప్‌ను మనకు మరొకవిధముగా పరిచయము చేశాడు. లిడియా దేశపు ప్రభువు చాలా ధనవంతుడు. ఆయన దర్బారులో ఈసప్, సాలన్ మొదలైన అనేక పండితులు, కవులు ఉండేవారనీ, ఆ ప్రభువుకు ఈసప్ ప్రీతిపాత్రుడనీ వ్రాశాడు. కాని చారిత్రకులలో ఒక్కరయినా ఈసప్ ఆదిలో బానిస కాదని వ్రాయలేదు. ఈసప్

పాలనలలో సాలన్ ప్రభువుకు గురువుగా నియమింపబడ్డాడు. కాని ఈసప్ కష్టసాధ్యమయిన అనేక పనులకు నియమింపబడ్డాడు. ఒక పర్యాయము ఈసప్ రాజాజ్ఞానుసారము గ్రామాలను నగరాలను పర్యటించుతూ ఏథెన్సుకు వెళ్లటము తటస్థించింది. అక్కడి ప్రజలు ఆ దేశపు రాజు పరిపాలనను ధిక్కరించ బూనుకొన్నారు. ఆ ప్రజలకు బుద్ధి చెప్పవలెనని ఈసప్ ప్రజలను కప్పలతో పోల్చిన కథను పదిమందికీ చెప్పి ప్రచారము చేశాడు. కథలలో జంతువుల పాత్రలను సృష్టించటములో నీతిని నర్మగర్భముగా బోధించవలెనను అభిప్రాయము ద్యోతకమవుతుంది. మానవులు తమ దోషాలను ఇతరులు విమర్శించడానికి ఇష్టపడరు. కాని - ఆ దోషాలను వర్జించి, నీతిని బోధించే కథలను సంతోషములో వింటారు. ఆ కథలలోని పాత్రలు మానవేతరములే అయితే జుగుప్సారహితముగా ఆదరిస్తారు. మానవుల పాత్రలను కథలలో సృష్టించి కృతకృత్యుడు కావటానికి ఈసప్ కాలము నాటి పరిస్థితులు సరసముగా లేవు. ప్రజల యొక్క గాని, ప్రభుత్వముయొక్క గాని వ్యతిరేకాభిప్రాయాన్ని వెలిబుచ్చి బ్రతికటము ఆకాలములో ఎవరికిని సాధ్యము గాని విషయము. వారి ఆగ్రహానికి గురిఅయిన వ్యక్తిని చిత్రవధ చేసేవారు. బ్రతికి ఉండగానే చర్మము వలిచి చెప్పులు కుట్టించుకునే కాలమది. ప్రభువుల ఆగ్రహానికి బలిఅయిన వారిని భటులు ఈడ్చుకొనిపోగా గమ్యస్థానము చేరునప్పటికి దోషి తాలూకు చెయ్యో - కాలో - రెండిటిలో ఒకటి మాత్రమే మిగిలేది. అటువంటి దుష్కాలములో ఈసప్ తాను చెప్పదలచిన నీతిని జంతువుల కథలలో ఇమిడ్చి ప్రచారము చేశాడు.

బిడ్డలకు చెప్పేకథలలో మానవుల పాత్రలను సృష్టించటము కొన్ని సందర్భాలలో చెడుపుకు కారణమవుతుందని కొందరు మనస్తత్వశాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు. కథల ద్వారా సూటిగా చెప్పబడిన అంశాలు బిడ్డల హృదయాలలో నిలచిపోతాయి. బిడ్డలు నీతినిమాత్రమే జ్ఞప్తియందుంచుకొని పాత్రలను విస్మరించరు. బిడ్డలకు కావలసినది కథ-దానిలోవున్న పాత్రలూను. ఆ పాత్రలు మానవులే అయినట్లయితే - 'వెంకయ్య జగడాలమారి' అని ఒకపర్యాయము విన్న తరువాత పసిబిడ్డల హృదయములో నుండి ఆ వెంకయ్యపాత్ర మరుగుపడిపోదు; అతని గుణగణాలు విస్మరింపబడవు. అంతే కాకుండా - జీవితములో వెంకయ్య అనే వ్యక్తి, యెక్కడ యెదురయినా 'జగడాలమారి' అన్న భావము అంతర్భూతముగా పని చేస్తూనే ఉంటుంది. దీనిప్రభావము అమోఘము. సాటిమానవులమీద నిర్హేతుకముగా జుగుప్స ఉదయిస్తుంది. ఆ కారణముచేతనే జంతువులపాత్రలను ప్రవేశపెట్టటము ఉత్తమమని భావింపబడ్డది.

జంతువులకథలు మనకు క్రొత్తకాదు. మహాభారతములో జంతువులు మాట్లాడినట్లుగా శాంతి, అనుశాసనిక పర్వాలలో వ్రాయబడ్డది. మూఢులయిన రాజకుమారులను లోకజ్ఞులనుగా, సకలశాస్త్రపారంగతులుగా చేయ బూనుకొన్న గురువు తన శిష్యులకు బోధించినవి పంచతంత్రకథలు. వీటిలోపాత్రలన్నీ ఇంచుమించుగా జంతువులే. పంచతంత్రానికిమహాభారతముమూలమనిచారిత్రకులు నిరూపించారు. ఈ పంచతంత్రకథలు దేశదేశాలూ ప్రాకి, ఖండాంతర ప్రచారము గాంచినవి. అనేకభాషలలోనికి అనువదింపబడినవి. పంచతంత్రకథలలోను, ఈసప్ కథలలోను జంతువుల పాత్రలు ఉండటము వల్ల ఒకదానికొకటి అనుకరణమయి ఉండవచ్చునేమో నను సంశయము కలుగుతుంది కాని ఈరెంటికీ ఒక భేదము ప్రత్యేకముగా స్పష్టముగా కనబడుతుంది. పంచతంత్రకథలు దీర్ఘములు; ఒకదానినొకటి ఆశ్రయించినవి. వాటికొకక్రమము ఉన్నది. కాని ఈసప్‌కథలు అన్నీ చిన్నవి - ప్రత్యేక ఇతివృత్తము కలవి. అతిసామాన్యస్వరూపములో వ్యక్తీకరింపబడినవి కనుకనే యివి ప్రాథమికదశలోని బిడ్డలకుమాత్రమే ఉపయోగకరములని తోస్తుంది. పంచతంత్రము పిల్లలలో పెద్దలకు ఉపయోగకరమైనది.

బాలవాఙ్మయము బిడ్డల వయసునుబట్టి, ఆయాకాలములలో వారి మనఃప్రవృత్తుల ననుసరించి నాలుగుభాగాలుగా విభజించవలసి ఉంటుంది. బిడ్డలకు 18 సంవత్సరాల వయసు వచ్చునరికి మనఃప్రవృత్తి అనేక మార్పులకు గురి అవుతుంది. బిడ్డలకు 3 సంవత్సరాలనుండి 5 సంవత్సరాలవరకు శైశవము 6 నుండి 11 సంవత్సరాలవరకు బాల్యావస్థ 11 నుండి 16 వరకు కౌమారము, 16 నుండి 18 సంవత్సరాలవరకు కౌమారదశకు యౌవనావస్థకూ మధ్యదశ అని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. ఈ దశల ననుసరించి బిడ్డలకు మార్గదర్శక మయినదీ మనఃప్రవృత్తుల ననుసరించి బుద్ధి వికాసానికి దోహదమిచ్చేదీ బాల సాహిత్యము అవసరము. దానంతట అది, సహజముగా, అడవిలో పెరగటానికి అనువైన జడప్రకృతినుండి— నిద్రాణస్వభావమునుండి మేల్కొలుపునట్టి రచనలు బిడ్డలకు కావాలి. ఈ కొలత బద్ధతో చూచినట్లయితే ఈసప్ కథలు 3 నుండి 5 సంవత్సరాల వరకూ ప్రత్యేకింపబడిన శైశవ దశలోను, 6 నుండి 11 సంవత్సరాలవరకు అని నిర్ణయింపబడిన బాల్యావస్థలోను ఉపయోగపడేవిగా ఉన్నవి.

ప్రభువు ఆదేశానుసారము డెల్ఫీ పట్టణములో రూకలను పంచటానికి వెళ్లిన ఈసప్ అక్కడి ప్రజల క్రౌర్యానికి బలి అయినాడు. ఈసప్ అవలంబించిన ఏ విధానమునూ మెచ్చని దురాశాపరులు ఆ ప్రజలు. ప్రతి వ్యక్తికీ కావలసినన్ని రూకలు లభించలేదని ఆగ్రహము కలిగింది. ఆ ప్రజలతో వేగలేని ఈసప్, ప్రజలకు పంచవలసినదని తనకు ప్రభువు యిచ్చిన ధనము, కొంత పంచిన తరువాత మిగిలిన దానిని తిరిగి పంపివేశాడు. దానికి ప్రజలు ఆగ్రహించి, అందరూ ఏకమై—అతడు ప్రభు రాయబారి అని తెలిసి కూడా, ఈసప్‌ను పర్వతాగ్రము నుండి దొర్లించారు. ఆ విధముగా ఈసప్‌కు క్రీస్తుకు పూర్వము 564 లో దుర్మరణము సంభవించింది. ఈసప్ యెడ అభిమానముగల కొందరు ఏథెన్సులో అతడి శిలా ప్రతిమను ప్రతిష్ఠించారు. సోక్రటీసువంటి ఇతర గ్రీకు గురువుల వలె ఈసప్ తన బోధనలను లిఖించలేదు; విన్నవారు వ్రాసుకొను రీతిగా, నోటితో చెప్పుకుంటూ పోయినాడు. ఆ కారణముచేత ఏ సంపుటి అతనిదో తెలియటము కష్టము. మరణించిన 3 శతాబ్దముల తరువాత గాని అతడి పేరుమీద గ్రంథములు ప్రచురింప బడలేదు. వాటిలో ఒకటి బాబ్రియస్ అను గ్రీకు రచయితచేత వ్రాయబడ్డది. ఆ రచయిత కవనము అనేక శతాబ్దాలవరకూ నిలచింది. 1846 లో అది లభించి గ్రంథస్థము చేయబడ్డది. ఈసప్‌కథల మరొక సంపుటి డెమాస్థెనియస్ ఉపన్యాసకునిచేత దాదాపు క్రీస్తుపూర్వము 320 లో ప్రచారములోనికి తీసుకురాబడింది

ఈసప్‌కథలు రోముదేశీయులకు బాగా పరిచయమైనవి. క్రీస్తుకాలములో ఫేడ్రస్ అను రచయిత ఈ కథలను లాటిన్‌భాషలో వ్రాశాడు ఇతడు ప్రభువైన అగస్టు సీజరుచే నిర్బంధమునుండి విడుదల చేయబడినవాడు. ఈ ప్రతులే పాఠశాలలలో పాఠ్యగ్రంథాలుగా ఉన్నాయి. రోమను సామ్రాజ్యపతనము తరువాత ఈ కథలు అనేక ఉత్తమ గ్రంథాలవలెనే దృష్టిపథమునుండి మాయమయి కొంతకాలము కాలగర్భములో మాటుమణిగినవి. దాదాపు 14వ శతాబ్దములో ఒక సంపుటి పండితుడైన ఒక మతప్రచారకునిచే పరిష్కృతము కావించబడ్డది. అది ఎంతో విలువకలిగినదిగా భావింపబడ్డది. అటుతరువాత ఈసప్‌కథలు తరచుగా క్రొత్తక్రొత్త ముద్రణము లందుకొంటూనే ఉన్నవి. ప్రతి ముద్రణములోను క్రొత్తమార్పులూ చేర్పులూ ఉండనే

#  బాలవాఙ్మయ నిర్మాతలు 

ఉంటున్నాయి. ఇంగ్లండు దేశములో తొలిసారిగా కాక్స్టన్ ముద్రించిన గ్రంథాలలో ఈసప్‌కథల సంపుటి ఒకటి. అది ప్లానుడెస్ ఫ్రెంచిభాషలో వ్రాసిన ప్రతికి అనువాదము. 1610 లో స్విట్జర్లాండు దేశపు పండితుడు అనేకవిధముల ప్రయత్నించి నిండు ప్రతి నొకదానిని సంపాదించినాడు. అప్పటినుండీ అదే ప్రామాణికమైనదిగా భావింపబడుతున్నది. గత మూడు శతాబ్దాలనుండీ ఈ గ్రంథము గాని దీని అనువాదాలు గాని బహుళప్రచారములో ఉన్నవి. క్రైస్తవుల మతగ్రంథమయిన బైబిలు తరువాత ప్రచారబాహుళ్యముగల గ్రంథము ఈసప్ కథలసంపుటి. ఈ కథలు నాగరికతగల భాషలన్నిటిలో అనువాదము చేయబడి తరతరాలుగా పఠింపబడుతున్నవి. ప్రస్తుతము ఈ కథలు మన సారస్వతములోకి చొచ్చుకొని, కలసిపోయినవి. వాటి ప్రభావము మన సంభాషణలలో ఎంతో ఉన్నదనుకొంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

ఈనాటి పరిశోధకులు చారిత్రకులు ఈ కథలు ఈసప్ స్వంత కథలు కావనీ, ప్రతి దేశపు జానపద వాఙ్మయములోనూ ఇటువంటి కథలు అనేకముగా ఉన్నాయనీ అముద్రిత గ్రంథాలు వెదకి వెదకి నిరూపిస్తున్నారు. కొన్ని వేల సంవత్సరాల క్రిందటనైనా గ్రంథాలలో ఇటువంటి కథలే ఉన్నాయని నిరూపించారు. బాబిలన్ ఇటుకలమీద ఈ కథలు చిత్రింపబడినాయనీ, ఈసప్‌కంటె 600 సంవత్సరాలకు పూర్వమే ఈజిప్టు పాపిరస్ స్క్రోల్సు వ్రాసి సింహము-ఎలుక కథలు చెప్పేవాడనీ నిర్ణయించారు. బౌద్ధ వాఙ్మయములో జంతువుల అజ్ఞానానికీ వేడుకలకూ సంబంధించిన కథలు అనేకముగా ఉన్నాయి. 'అన్ని దేశాలలోను కథలు ఉండవచ్చును గాని అవి ఈసప్ కథలవంటివి కావు' అని కొందరి నమ్మకము. కథను మన మెట్లా వినదలచుకొంటామో ఆ విధముగా చెప్పినవాడు ఈసప్. అతి సామాన్యముగా - సూటిగా వివేకముతో ముచ్చటగా - శతాబ్దాలతరబడి చెప్పుకొన్నవయినా నవచైతన్యముతో అలరారే రసగుళికలు ఈసప్ కథలు. ఈసప్ అవిస్మరణీయుడు.

బాలవాఙ్మయములో ఈసప్‌కథలు కట్టుకథలయితే హాన్సు ఏండర్సన్ రచించినవి దివ్యులవీ దివ్యమానుషులవీ గాథలు (Fairy Tales) వీటిపైన తేలే తామరపూలవలె కనబడుతవి. కాని వాటి వేళ్లు భూగర్భములోకి చొచ్చుకొనిపోయినట్లు ఆ కథలు కాలగర్భములో కలసిపోయిన భూతలాన్ని వెదక్కుంటూపోతవి. ఈ కథలు సంభావ్య శ్రేణికి చెందవలెనన్న నియమము లేనివి. ప్రాచీనుల దివ్యమానవ గాథలన్నీ మత సంప్రదాయాలను అనుసరించినవి. ఈ గాథలను సేకరించి ప్రజల కందించినవారు గ్రిమ్ సోదరులు, హాన్సు ఏండర్సన్.

హాన్సు ఏండర్సన్ డెన్మార్కులో 1805లో, ధనాభావము ఉన్నప్పటికీ గౌరవముగా బ్రతికిన కుటుంబములో జన్మించాడు. తండ్రి చెప్పులు కుట్టేవాడు. తల్లి కాయకష్టము చేసేది. తండ్రి స్వయంకృషి చేసి తాను విద్య నభ్యసించి కుమారునికి విద్య నేర్పాడు. కథలూ నాటకాలు చదివి వినిపించేవాడు. తండ్రి భావనాశక్తి, తల్లి లోకజ్ఞానమూ వాత్సల్యము ఏకమై హాన్సుఏండర్సన్‌గా రూపొంది, అతడిని బాలవాఙ్మయ సృష్టికర్తగా తీర్చిదిద్దినవి. ఏండర్సన్ పేదకుటుంబములో జన్మించినా, బాల్యదశ అతి దైన్యముగా గడచినా అతడి కవి దివ్యస్వప్నుడే. తన బాల్యజీవితాన్ని గురించి అతడు తన స్వీయచరిత్రలో వ్రాసుకొన్నాడు. ఆ ఉన్న ఒక్క గదిలో చెప్పులుకుట్టే సామగ్రితో పాటు అపూర్వశిల్పాలు, సంగీతసాహిత్య గ్రంథాలు ఉండేవని.

హాన్సుఏండర్సన్‌కు తండ్రి, బొమ్మల నాడించుకోవటానికి ఒక థియేటరును నిర్మించి యిచ్చాడు. ఆ బొమ్మ పాత్రల నభినయింప చేయటానికి అతడు నాటకాలు వ్రాశాడు. అతడికి 11 సంవత్సరాల వయసులో తాను వ్రాయతలపెట్టిన ఒక నాటకములోని పాత్రలపేర్లను ఇంటిలో ఉన్న వారందరికీ వినిపిస్తూ ఉండేవాడు. ముత్తవ తల్లి అతడికి సమ్మోహనాస్త్ర తుల్యమైన దేవతలకథలు దయ్యాలకథలు చెప్పి మురిపిస్తూ ఉండేది. ఏండర్సన్ వ్రాసిన 'ది అగ్లీ డక్లింగ్' 'దిరెడ్‌షూజ్', 'దిస్నో క్వీన్' కథలలో అతడి బాల్యజీవిత ఘట్టాలున్నాయని పలువురి అభిప్రాయము. అతడి బాల్యములో తండ్రి చనిపోగానే తల్లి పునర్వివాహము చేసుకొన్నది. సవతితండ్రి నిర్దయ చూపకపోయినా, శ్రద్ధకనబరచలేదు. తల్లికూడా వెనుకటి వాత్సల్యాన్ని చూపలేకపోయినది. అతడిని దర్జీవృత్తిలో శిక్షణ పొందుమని చాల ప్రోత్సహించినది. కాని-ఏండర్సన్ తనకు నాటకాలలో వేషాలు వేసి నటించటము ఇష్టమని చెప్పి అందు కామెను ఒప్పిస్తాడు. భవిష్యమర్థము గాని పరిస్థితులలో దివ్యమానవగాథలలోని నాయకుడు తన అదృష్టమును వెదుకుకొంటూ వెళ్ళినట్లుగా ఒక పరిచయపు టుత్తరము వెంటతీసుకొని హాన్సుఏండర్సన్ ఇంటినుండి బయలుదేరిపోతాడు.

కొన్ని సంవత్సరాల కృషి తరువాత అతడి నాటకాలు బహుజనామోదాన్ని బడసినవి. ఆదేశపురాజు ఆరవఫ్రెడ్రిచ్చి అభిమానముతో, పదిమంది సహాయముతో అతడు పాఠశాలాప్రవేశము చేసి విద్య నభ్యసించాడు. అతడి 24వ ఏట 1829లో ఏండర్సన్ ప్రథమ గ్రంథము ఆవిర్భవించినది. అనంతరము దేశాటనము చేస్తూ అతడు అనేక దివ్యమానవ గాథలను(Fairy tales) రచించాడు. ఒక్కొక్క దేశయాత్ర చేసి ఒక్కొక్క గ్రంథాన్ని రచిస్తూఉంటే, అతడి పేరుప్రఖ్యాతులు డెన్‌మార్కు దేశపు సరిహద్దులనుదాటి ప్రపంచమంతటా ప్రాకిపోయినవి. ఆదిలో అతడు తన బాల్యస్మృతిలో ఉన్న గాథలను విన్నవాటిని విన్నట్లుగా జ్ఞాపకమున్నంతవరకూ వ్రాశాడు. తరువాత కల్పిత కథలను రచించాడు. 1842 లో బాల్యదశలో తానుపడిన కష్టాలను స్మరించుకొని, వాటికొక సుందరకల్పన చేసి, దానికి 'ది అగ్లీడక్లింగ్' అని పేరు పెట్టాడు. సరళమైన, నిత్యోపయోగమైన పదజాలముతో రచింపబడిన ఆ గ్రంథము అతడి ఇతర రచనలవలెనే ప్రఖ్యాతి గాంచినది. ఇతర బాల వాఙ్మయ రచయితలవలె ఏండర్సన్, రాజులు రాణులు అంతఃపురాలు, విమానాలు రమణీయమైన దృశ్యాలు శకటాలు మొదలైన వాటితో తన రచనలను నింపి వేయలేదు. సామాన్య గృహోపకరణాలు, బొంతి సూదులతో సహా, గృహావరణములో మెదిలే జంతువులు, సామాన్యుల ఆహారము మొదలైనవి అతడి రచనలలో వాటివాటి ప్రత్యేకతలతో, రాణిస్తాయి. ఆ వస్తువులు పిల్లలవలెనే ఆలోచిస్తవి—మాట్లాడుతవి. అతడు ఏ దృష్టితో వాటిని వ్యక్తీకరించాడో పిల్లలు కూడా ఆ దృష్టితోనే వాటిని గ్రహిస్తారు. 1846 లో ఏండర్సన్ కథలు ప్రథమముగా ఆంగ్ల భాషలోకి మేరీహోలిట్ అను రచయిత్రిచే అనువదింపబడినవి. అతడి స్వీయచరిత్రను కూడా ఆమె అనువదించినది. అతడు 1875 లో మరణించాడు. హాన్సు ఏండర్సన్ నవలలు నాటకాలు రచింపవలెనను అభిలాష కలవాడు. కాని అతడికి వాటిలో పేరు ప్రఖ్యాతులు రాలేదు. ఉబుసుపోక—బిడ్డలకు వ్రాసిన దివ్య

(56-వ పేజీ చూడండి)




# బొమ్మల పెళ్ళి

చాగంటి సోమయాజులు

"తుమ్మలా తుమ్ములా? రెండూ ఉన్నాయి. మీరేది చెప్పమంటే అది చెపతాను." అన్నాది ముత్తవ్వ.

"తుమ్మల మాటే," అన్నాది ముని మనమరాలు. తుమ్మలమాట ఏభైసార్లు మునిమనమరాలు వింది. విన్నదే వినడం దానికి సరదా. చెప్పిందే చెప్పడం ముత్తవ్వకి సరదా.

"అలాగ చెప్పండి. తుమ్మల తగాయిదా గొడవ గొడవగా ఉంటుంది. మా వూళ్ళో తుమ్మెదిబ్బోళం మా చిన్నతనంలో రామ రావణ యుద్ధం అయిపోయింది. దాంట్లో వ్యవహారపు పేచీలు ఇన్నీ అన్నీ కావు. ఇద్దరు చచ్చిపోయారు. పాతిక ముప్ఫై మందికి గాయాలు తగిలి రక్తమండలాలై పోయాయి. అదుగో, ఆ దొమ్మీ అయి నాకే మా నాన్న కట్టుకాసుల పేరు మా అమ్మకి చేయించాడు. అందులోకీ ఆ రాము నాయుడున్నాడే వాడు రావణాసురుడే. "వాడికి పుట్టిన పోయికాలం బుద్ధి ఇంతా అంతా కాదు" అంటూ ముత్తవ్వ తుమ్మ డొంకల్లోకి పోయింది.

"తుమ్మలు కాదు తుమ్ములు," అన్నాడు మునిమనవఁడు.

"అలాగేదో చెప్పండి మరి," అన్నాది ముత్తవ్వ.

"బాగా చెప్తు. బాగా చెప్పితే పొద్దుస్నే నీకు దోర జామికాయలు కోసిదు కోసి పెడతాను" అన్నాడు మనవఁడు. ముత్తవ్వ పొళ్లు వొడిలిపోయినా, దృష్టి మాంద్యం వొచ్చేసినా పళ్ళుమాత్రం ఊడ లేదు. దోర జామికాయలు ఊడతలాగ ఎన్నిచ్చినా అంత చక్కగాను కొరుక్కు తింటుంది.

"రుధిరోద్గారినామ సంవత్సరానికి రుధిరోద్గారినామ సంవత్సరం అరవై ఏళ్లు. ఇది ఈశ్వరనామ సంవత్సరం. రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన," అని ముత్తవ్వ వేళ్లు లెక్క పెట్టింది.

"ధాత, ఈశ్వర ఇవి వచ్చే యేళ్లు. ఇఱ్ఱై ఐదేళ్లు అప్పుడే అయిపోయింది. అంతా నిన్న మొన్నలాగుంది! అప్పుడు నేనింకా ఏడేళ్ళదాన్ని. గోచీ పెట్టుకుని ఊరంతా తిరిగేదాన్ని." "ఛీఛీ తవ్వా! గోచీ పెట్టుకు తిరిగేదానివా?" అని పరమసహ్యంతో మునిమనవఁడు అడిగేడు. ముత్తవ్వ వాళ్లమ్మమ్మకి అమ్మ. మునిమనవఁలంతా తవ్వా తవ్వా అని పిలిచేవాళ్లు.

"తవ్వని కాకపోతే పోల నాకొడుక్కా!" అని ముత్తవ్వ పొంగిపోతూ అలాగ పిలిస్తేనే సంబరపడిపోయేది.

"ఛీఛీ ఏం? అంచకొక్క గోచీలు పెట్టుకునే వాళ్ళం. ఎంత పెద్దింటి పిల్లలైనా గోచీలే! చిన్నపిల్లలకి వొంటినిండా బట్ట లేమిటి నా నెత్తి! పసుపులు రాసుకొని దబ్బపండులాగ మిసమిసలాడుతూ వొళ్లంతా కనబడితేనే ఆ ఈడు పిల్లలకి అందం. ఓ పెళ్ళిళ్లకీ, పేరంటాలకీ, కార్యాలకీ, కథలకీ వెళ్ళినప్పుడు లంగాలూ కబ్బాలూ తొడుక్కునే వాళ్ళం. ఇప్పుడంతా తెనుగు మారిపోయారు."

"గోచీల గొడవలో పడకు" అన్నాడు మునిమనవఁడు.

"తవ్వ అలాగే చెప్తుంది. చెప్తు చెప్తు తవ్వా" అన్నాది మునిమనవఁరాలు. కణ కణలాడుతున్న నిప్పులలో పెద్ద ముట్టకుంత తీని ముక్క పెట్టుకుని తవ్వా మనవఁలు తెల్లవారుఝామున వెచ్చగా కూచున్నారు. తవ్వ తాపీగా ప్రారంభించింది.

"ఊళ్లోకి ఎరకలాళ్లు కర్ణపిశాచి ఉన్నట్టు నల్లకూనలూ పట్టుదారాలూ తీసుకొచ్చారు. వొళ్లు వెలపెట్టి పుచ్చుకున్నాం."

"వొడ్లంటే?" మునిమనవఁడు అడిగేడు.

"వొడ్లంటే తెలియదురా నాగమ్మ! ఇప్పుడు పట్నాల్లో పిల్లలకి ఏమీ తెలియవు! వొడ్లంటే ధాన్యం. వెలపడితేనే ఏవొస్తువైనా కొనుక్కొడం. ఎర్రని రాగిడబ్బు కంటబడేదికాదు. గరిసెలకొద్దీ, పుట్లకొద్దీ యింటినిండా దినుసులుండేవి. ఎన్నిపుట్లు కొలిచిపోసినా కోవఁటి వదిరూపాయిలు

చేతిలో పెట్టేవాడుకాదు. సంవత్సరానికి ఐదురూపాయిలు - ఐదంటే ఐదు రూపాయిలు - పన్ను కట్టకోలేక మా మేనమామ ఏభైఎకరాల భూమి వొదులుకున్నాడు"

"తవ్వా తవ్వా తుమ్మలమాట మరిచిపోతున్నావు," అన్నాడు మునిమనవఁడు.

"తవ్వ అలాగే చెపుతుంది. చెప్పు చెప్పు తవ్వా," అంది మునిమనవరాలు

"నీక్కేంపోయింది జేగంట వేళైపోతుంది" అన్నాడు మనవఁడు. వాళ్లనాన్నగారు వట్టింట్లో ధావళీ కట్టుకుని, ధావళీ కప్పుకుని, దేవుఁడు పట్టుకెదురుగ్గా కూర్చుని 'కలియుగే ప్రథమపాదే' అని ఏనాడో దేవతార్చన సంకల్పించాడు. వాళ్ళమ్మా బామ్మా రెండు పెడాపొయ్యిలు బండెడు కర్రలతో ముట్టడించి వంట వండేస్తున్నారు. తెల్లవారుఝామున రోజో పిండివంటతో వంట వండుకుని దేవతానైవేద్యాలు పెట్టి సూర్యోదయానికి పూర్వమే ధనుర్మాసమంతా భోజనాలుచేసేవారు. వాళ్లనాన్న జేగంట కొట్టరా అంటే పూజపూర్తై భోజనం దగ్గరపడ్డాదన్నమాటే.

ముత్తవ్వ మళ్ళీ మొదలెట్టింది.

"ఇత్తడిరేకుయిచ్చి కంసాలిని పుస్తెలు చెయ్యమన్నాను. అలాగేనమ్మా అని కంసాలి నిలుచున్నపాళంగా మధ్యని ఎర్రరాళ్లు వేసి పుస్తెలు చేసి పెట్టేడు"

"కంసాలికి వొడ్లు ఇచ్చారా?' అన్నాడు మునిమనవఁడు. ముత్తవ్వ మొహంమీది ముడతలన్నీ గర్వంతో నిండిపోయాయి. తొంభైఏళ్ల తొక్కు పులికోదలాగ మొహం పెట్టుకుని చెప్పింది.

"వొడ్లు ఇవ్వడం ఖర్మమేం? ఊళ్లో కంసాలి ఊరికే చేసిపెట్టేడు. మా నాన్న మరెవ్వరూ కాదు కరణంగారు. గడగడలాడిపోయేవారు అధికార్లంతా మా యింట్లోనే బస అంతా వెట్టిచాకిరి చెయ్యవలసిందే. ఏదికావలసివచ్చినా కాకిచేత కబురంపితే చాలు బెల్లపుదిమ్మలు, నేతికుండలు సర్వం - దినుసులన్నీ వొచ్చి పడిపోయేవి. శుభకార్యమంటే ఇహ చెప్పతరంకాదు. మా నాన్న ఏలుబడి మాగొప్పఏలుబడి. జిల్లాకే పేరుమోసిపోయేడు. ఏనాడున్నాడో ఏలోకంలో ఉన్నాడో! ఎక్కడికేను వెళ్ళడంటే రెండెడ్ల సవారీ బండీ ఘల్లుఘల్లుమని మువ్వలు మోగుతూ రీవిగా వెళ్ళేది ముందు దివిటీలు పట్టుకుని ఇద్దరు చాకళ్ళు పరిగెట్టేవారు. వెయ్యిమంది వెంటవెళ్ళేవారు. ఇదిగో మా అన్నదమ్ములు చేజేతులా మిరాసీ వొదులుకుని ఉద్యోగాల్లో ప్రవేశించారు. బూరెల్లోనూ బొబ్బట్లలోనూ గిన్నెడేసి నెయ్యి దిమ్మరించుకొనేవాళ్ళం - ఈ తరవాత పప్పూ వొణ్ణంలోకి మిల్లి గరిటెడు నెయ్యికి మొహం వాచిపోతున్నాము."

"తవ్వా తవ్వా నేతుల గొడవలో పడిపోయావు," అన్నాడు మునిమనవఁడు.

"చెప్పు చెప్పు తవ్వా," అన్నాది మునిమనవఁరాలు.

"ఏం చెయ్యమన్నావురా మా తండ్రులనాడు నేతులు తాగేము. జ్ఞాపకమొస్తే వొళ్ళు ఝల్లుమంటుంది. మా తాతతండ్రులయిల్లు తాటేకుల మిద్దెయిల్లే. వాస తరవాత వాస; వాస తిరవాత వాస. నాలుగు వాసల యిల్లు ముప్ఫైరెండు గదులుండేవి. మా తండ్రులనాటిదాకా సమిష్టిగా ఏకకుటుంబమే. నిత్యం పెళ్ళివారిల్లులాగుండేది. వొణ్ణం ఎప్పుడూ బిందెలతో వార్చడమే. ఆ వంటలూ వార్పులూ ఇప్పుడు లేనేలేవు ఆడవాళ్ళలో ఆ జవసత్తువలూ లేవు. ఆ మనుషులూ ఆ అభిమానాలూ అన్నీ వెళ్ళిపోయాయి ఆ యింట్లో మా ఆడపిల్లలకి వేరే బొమ్మరిల్లు ఉండేది. ఆడపిల్లలు బొమ్మల పెళ్లిళ్లు చేసుకుంటారని పెద్దవాళ్ళ బొమ్మరిల్లు కట్టించారు లక్కస్తంభాలతో పెద్ద పందిరి, పందిరికింద పెళ్ళి తీనూ మా తాతలనాటినుంచీ ఉంది. మా తాతల అప్పచెల్లెళ్లు, మా మేనత్తలు వాళ్లనాడు వాళ్లు ఎన్ని పెళ్ళిళ్లో ఆ పందిట్లో చేసుకున్నారు. మానాడు మేమూ చేసుకున్నాము. బొమ్మలపెళ్ళి బొమ్మల పెళ్ళిలాగ చేసేవాళ్ళమా? నిజం పెళ్లిలాగే యథావిధిగా అన్ని తంతులూ జరిపి ఐదురోజులూ పెనుప్రళయంగా చేసేవాళ్ళము.

రుధిరోద్గారినామ సంవత్సర వైశాఖ బహుళ విదియ ఆదివారం మా అక్కయ్య వివాహం నిశ్చయమైంది. ఆ పెళ్ళిలోనే నా ఆడబొమ్మకీ మా వొదిన మొగబొమ్మకీ పెళ్ళిచెయ్యడానికి నిశ్చయ తాంబూలాలు మా వొదినా నేనూ ఇచ్చుకున్నాము. పందిట్లో మా అక్కయ్య పెళ్ళి అయిన మరి నాలుగు ఘడియలకి మేము మంచి ముహూర్తం చేశాము. మా బొమ్మలపెళ్లికి ఒక టకోరామేళం వీరణాలతో సహా మా నాన్న ప్రత్యేకం ఏర్పాటు చేయించారు - పిల్లలు సరదా పడుతున్నారంటే మా నాన్న కొండమీద కోతిని తెప్పించి అక్కడ పెట్టేవాడు. పెళ్లికి కావలసిన సమస్త వస్తుజాలం బొమ్మరింట్లో ఉండేది. ఊరేగించడానికి మా ముసలమ్మలనాటి లక్కపల్లకీ మాదాకా ఉంది.

ఏత గంగడు తేత తాటిమట్ట కొట్టి తెచ్చి పెట్టేడు. పచ్చగా బంగారంలాగ మెరుస్తున్న విడల్పాటి తాటిరేకులతో బొమ్మల్ని చేశాము."

"అబ్బా! ఇంత పెళ్ళి తాటేకు బొమ్మలకా?" అని ఏవగించుకొన్నాడు మునిమనవఁడు.

"తాటేకులైతేనేం? దర్జీదగ్గర కుట్టి పట్టుపరికిణీ కబ్బా పెళ్లికూతురికీ, చెమ్కీ ముఖమల్లుకోటు పెళ్లికొడుక్కీ కుట్టించి తొడిగేము. ఐతే అవి ఎదురుసన్నాహానికి ముత్యాల పల్లకిలో ఊరేగించడానికిమాత్రమే... మధుపర్కాలు కట్టినదగ్గరనుంచీ - దీక్షా వస్త్రాలుకదూ - వాటితోటే ఊరేగించేవారము. పసుపు నలుగులుపెట్టి మంగళస్నానాలు చేయించినదగ్గరనుంచి తాటేకు బొమ్మలైనా కళకళలాడుతూ ఎంత బాగుండేవి! పెద్దపెద్దవాళ్లంతా ఎంతో మెచ్చుకున్నాగా. ఇంత చిన్నపిల్లలు ఎంత బాగా చేశారంటే ఎంతబాగా పెళ్లి చేశారని అంతా ముక్కుమీద వేలేసుకొన్నారు. లగ్నం మొదలు నాగవిల్లిదాకా ఏవొక్కటీ వొదిలిపెట్టలేదు. ఎప్పుడేది చేస్తారో మాకు తెలియకపోతేకదూ!

పాటలతో పెళ్ళిపందిరి ఎగరగొట్టేశాము. ఎన్నెన్ని పాటలు! బొమ్మపెళ్ళికని - చదువులు రావుకదూ! - నోటితోటే అన్ని పాటలూ చెప్పించుకొన్నాము. నలుగుల పాటలు, ద్వారబంధందగ్గరపాటలు, మంగళహారతులు, అలకపాన్పుదగ్గరపాటలు, అంపకపు పాటలు ఇన్ని అన్నినా? ఎక్కడా - ఒక్క స్వరస - తప్పిపోకండా - ఏ సమయంలో - ఏది పాడాలో - అది పాడి - శెబాసనిపించుకొన్నాము.

అక్కయ్యపెళ్ళికి పెదపందిట్లో నాగవిల్లి బాజా వాయించారు. నాగవిల్లి బాజా స్వరం వింటే నేకళ్లు చెమరుస్తాయి. మేమూ పెళ్ళికూతుర్ని అంపకాలు పెట్టేశాము. ఇహ నాకు దుఃఖమాగిందికాదు. ఏడుపు ఏడుపు ఒకటే ఏడుపు! ఎంతమంది ఓదార్చినా ఏడుపు ఆగింది కాదు!"

"బొమ్మని అంపకం పెట్టినా ఏడుస్తారా?' అన్నాది మునిమనవఁరాలు.

"ఏడుపొచ్చేసింది దానంతకదే! నాకెవ్వరూ చెప్పనయినాలేరు పెళ్ళికూతురు బొమ్మ నాది. పెళ్ళికొడుకు బొమ్మ మా వొదినది. అదీ నాయుడుదే. వియ్యపురాలితనం ఇంతా అంతా చేసిందా? అలకల మాలక్ష్మి అంటే అదే నెయ్యి వియ్యాళి



# చంద్రగిరి మహాలు

కొండకోనల మధ్య కొలువుతీర్చిన కోట
దండి గుండెల మహా వీరులుండిన కోట
ఇది తెనుగు రాజుల చంద్రగిరి కోట
పదునుకత్తులు మండి మెరసె నిచ్చోట!
తలవాల్చి ఎరుగని రారాజు వోలె
విలసిల్లియున్నదీ రాజభవనమ్ము
ఇది ఏమి గాంభీర్య మిది ఏమి హొంగులు
ఇది తెనుగు రాజుల చంద్రగిరి మహాలు!
ఏ బంటు నిలిచెనో ఆ బురుజుపైన
ఏ భటుడు నడిచెనో ఆ కోటపైన
ఏ రాణి పారాణి రాలెనో యిచట
ఏ రాజు మీసమ్ము త్రిప్పెనో యిచట
కోటలో కోనేరు, కోనేరులోన
కొల్లగా పూచిన అల్లి తామరలు
ఏ రాణి మెడలోన చెన్నులొలికినవో!
ఏ రాజ్ఞి కర్ణభూషలుగ మెరిసినవో!

శత్రువీరుల నెల్ల చీల్చి చెండాడి
సమరరంగమునుండి మరలి ఏతెంచు
ఏ రాజుపై నిచట పూలు కురిసినవో
ఏ రాణి కళ్లు కాంతులను చిమ్మినవో
ఆ వేడ్కలన్నిటిని ఎవరు చూచారు?
ఆ గాథలన్నిటిని ఎవరు చెబుతారు?
నరుని దల్పాయువు, మరచిపోయాడు,
గిరులునూ, తరువులూ మాట్లాడలేవు.
రావోయి తమ్ముడూ! రావమ్మ చెల్లి!
భావింత మొకసారి మన పూర్వగాథ
తలచుకుంటే బాధ రాము పొమ్మంటు
అలిగి కూవోకండి! కదలి రారండి!
కోటలోపల కలదు ఒక పెద్దతోట
తోటలో నున్నది మన రాజమహాలు
మీర లొకపరి దాని చూచిన చాలు
మెదలు మీ మదిలోన అది పవలు రేలు.

మధురాంతకం రాజారాం



# బొమ్మల పెళ్ళి



తింపులు విప్పారించుకొని ప్రాణాలు రాచి అంపాని పెట్టింది. అప్పగింతల వేళ రాగానే 'వెళ్ళిపోతాం బళ్లు కట్టించియ్యండి' అని గంగవెర్రు లెత్తించింది. నాకూ ఇక తొరింటి కెళ్ళిపోతోందిరా అని నేనొక్కటే ఏడుపు!

ఆ బొమ్మల పెళ్ళితో నా సరదాలన్నీ తీరి. మరి నాలుగు నెలలైనా తిరక్కుండా నా పెళ్లి అయిపోయింది. అనుకోకుండా నాకు కళ్యాణ ఘడియ కొట్టుకొచ్చింది." అని జాలిగా చెప్పింది ముత్తవ్వ. తన కళ్యాణ విషయం సంతోషంగా చెప్పలేదు!

"బొమ్మల పెళ్ళి సరదాగా అయింది. తరవాత నీకు పెళ్ళైంది," అన్నాడు ముని మనవఁడు.

"పెళ్ళి అయింది నాయనా! ఆడదాని బతుకంత హీనం మరోవాటి లేదు" అంది ముత్తవ్వ.

"తవ్వా నిన్ను ముసలి మొగుడికిచ్చేరు కదూ?" అన్నాది మునిమనవఁరాలు.

"మొగాడికి ముసలేవిఁటితల్లీ ఆడదాని కైదోతనం ఉండాలికాని," అన్నాది ముత్తవ్వ.

"మీ నాన్న అంత గొప్ప కరణంగారు కదా ముసలాడి కెందుకిచ్చాడు?" అనడిగింది మునిమనవఁరాలు.

"ఇవ్వక తప్పుతుందా? ఆయనెవరో అనుకున్నారా? మా పెద్దమేనత్త పెద్ద కొడుకు. నడివయస్సులో పెళ్లాం చచ్చిపోయింది. ఉన్న మేనమామల కూతుళ్లలో పెద్దదాన్ని నేనే. వాణ్ణోయింటివాణ్ణి చెయ్యకపోతే ఎలాగ అని మా నాన్నే నడుం కట్టుకుని చేశాడు. ఆరోజులూ అభిమానాలూ వేరు. ఇప్పుడుతే మేనరికాలే కాక తన్నుకుంటున్నారు" అన్నాది ముత్తవ్వ.

"గొడవ గొడవ చేస్తున్నావు. ఓ మూల నుంచి తెల్లారిపోతున్నాది" అన్నాడు ముని మనవఁడు. వాడికి ముత్తవ్వ పెళ్లిగొడవ బోధపడలేదు.

"తెల్లారి పోయింది!...నాయన్నాయన ఒక్కసారి వీపు గోకి పెడుదూ చివఁచివఁలాడిపోతున్నాది. దబ్బు దబ్బున చెప్పేస్తాను" అన్నాది ముత్తవ్వ. "గోకుతాను చెప్పు" అని మనవఁడు వీపంతా బరుకూ బరుకూ బక్కరిగాడు. "తప్పేస్రోయ్ తప్పేస్రోయ్! ఇహ చాలు. వీపంతా రాసి," అన్నాది ముత్తవ్వ.

"పెళ్లి పూర్తయిందా? ఇహ చెప్పు. తెగంట తెరైపోతున్నాది," అన్నాడు మనవఁడు. వాళ్ళ నాన్న సుస్వరంతో కంఠం బాగా ఎత్తి దేవతార్చన చేస్తున్నాడు. మనో నైవేద్యానికి వంటకాలన్నీ వాళ్ళమ్మ నట్టింట్లో తెచ్చిపెట్టేసింది. బుడబుక్కల వాడు ఏ వీధిలోనో బుడబుడ బుడక్కొంటున్నాడు. దేవాలయంలోంచి గంటలు తేగంటలు బయల్దేరాయి.

"ఎవరైనా పాడుంటుంటే బాప్పుణ్ణు. ఆచారిగారు దద్దోజనం చక్రపొంగలి పోయిగా తినేశారు" అన్నాడు ముని మనవఁడు.

"మనింట్లో పిండివంట లేకపోతే కదా!" అన్నాది మనవఁరాలు.

"తవ్వా చెప్పు చెప్పు" అని తొందర పడ్డాడు మనవఁడు. ముత్తవ్వ కుంపట్లో నిప్పులన్నీ కూడదీసి మళ్ళా మొదలెట్టింది.

"ఇహ నేముంది? అయిపోయింది. నాగవల్లి బాజా వాయించేశాము. తెల్లవారు ఝామున పిల్లలందర్నీ దబదబా లేపేసి దబ్బు దబ్బున చద్దన్నాలు పెట్టేశారు. మేము వొణ్ణాలు తింటూఉంటే వీధిలో భజంత్రీలు మోరెత్తుతూ వాయించారు బాకాలతో. మేము చూడకుండానే పెళ్లికూతుర్నీ పెళ్ళికొడుకునీ సవారీలో ముందు పంపించేశారు. మేము వీధిలో కొచ్చేసరికి వీధి నిండా రెండెడ్ల గూడుబండ్లు పూనేసి సిద్ధంగా ఉన్నాయి. గర్భిణీ స్త్రీలకి ప్రత్యేకంగా మేనాలు పందిట్లో ఉన్నాయి. మమ్మల్నో రెండెడ్ల బండిలో ఎక్కించారు. మాకు జ్ఞాపకం లేకపోయింది. తొందర తొందర. ఏమైనా తోస్తేనా? ఇహ బళ్లు కదలడానికి సిద్ధంగా ఉన్నాయి. మా వొదినకి జ్ఞాపక మొచ్చింది. ఏవిఁటి సాధనవంటే ఏవిఁటి సాధనం అనుకొని ఏం బుద్ధి అంటే ఏం బుద్ధి అనుకొని గుంజాటన పడిపోయాము.

బండి గూడునుంచి ఈనె పీకి ముక్కులో పెట్టుకుని "హాఁచ్ఛీఁ" అని తుమ్మేను. ఇహ వరసగా తుమ్ము తరవాత తుమ్ము తుమ్ము తరవాత తుమ్ము ముక్కు బద్దలైనన్ని వొచ్చేయి.

మా నాన్న పెద్ద చేపాటికర్ర పట్టుకుని దుట్ట కొలుస్తూ పందిట్లో నిలబడి అందరికీ పనులు పురమాయిస్తున్నాడు. 'ఎవర్రా పెధతల్లారా తుమ్ములూ!' అన్నాడు. ఒక పక్క నేనని తెలిస్తే రానివ్వాడని భయం, ఇంకో పక్క తుమ్ములు నాన్న చెవులో పడ్డాయని సంబరం! ఇక్కిన పేనులాగ కిక్కురుమనకుండా కూచున్నాను. ముక్కులో దురద పోదలేక మళ్ళా తుమ్మొస్తూఉంటే ఓ బలవంతాన అపుకొని దచ్చాను. అంతా మొహా మొహాలు చూసుకొన్నారు. విసవిసలాడారు.

'సయకే పెళ్లికొడుకు పెళ్లికూతురూ వెళ్లిపోయారు' అని సముదాయించుకొన్నారు.

'తుస్సుతుస్సుమని పెధవతుమ్ములు దిగండంతా బళ్లు' అన్నాడు మా నాన్న. గోల గోల అయిపోయింది. అందర్నీ దింపి అందరికీ కాళ్లు కడుక్కోమని కూడో పెట్టారు."

"ప్రయాణానికి సిద్ధంగా ఉంటే బుద్ధీ జ్ఞానం లేకుండా ఎందుకూ తుమ్మేవు? నీ బుర్ర చితగ్గొట్టవలసింది" అన్నాడు మునిమనవఁడు.

"విను విను చెపుతుంది," అన్నాది ముని మనవఁరాలు. మనవఁడు అన్నమాట ముత్తవ్వకి మహాకోపం వచ్చింది. ఆనాడు వాళ్లెవ్వరో అన్నట్లు ఈనాడు మనవఁడు బుద్ధీ జ్ఞానం లేదంటే ఉక్రోషం వొచ్చింది. పెద్దగొంతుకతో పళ్లు కొరుక్కుంటూ మనవఁడిమీద విరుచుకుపడ్డాది.

"ధెవెధా ఎందుకు తుమ్మేనా? నీ సొమ్మేం పోయింది. గండగత్తెర మా కొచ్చిపడ్డాది. ఇంత బొమ్మల పెళ్ళి చేశామా? పెళ్ళి కూతుర్నీ పెళ్ళికొడుకునీ గృహప్రవేశానికి తీసికెళ్ళాలా? ఆ బొమ్మలు బొమ్మరింట్లో ఉండిపోయాయి బండెక్కి మేం కూచున్నాము. దాంతో ప్రయాణం వో ఘడియ ఆగిపోయింది. దబ్బుదబ్బున బొమ్మరింట్లోకి పరిగెత్తేము. బొమ్మలు, సవారీ, మిగతా సరంజామా పెద్ద రంగురంగుల తాటేకుల బుట్టలో పెట్టి సిద్ధంగానే ఉంచాము. అది పట్టుకు పందిట్లోకి పరిగెత్తేము" అని ముత్తవ్వ ఎందుకు తుమ్మిందో చెప్పింది.

తుమ్ములమాటైపోగానే క్షీరాన్నంలో ఏలకపళ్ళ వాసన ఘుమఘుమలాడుతూ వసారాలోకి వచ్చింది. వాళ్లనాన్న దేవతార్చనమాత్రం "పాపాత్మా పాపసంభవా"లో పడి "రక్షరక్షో మహేశ్వరా" అనలేదు.



బాలసాహితి సీరియల్ ......

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్ .....

## 12

సన్యాసి కుటీరంలో మార్టిన్, బార్నీ చాలా వారాలున్నారు. సన్యాసి చెప్పే వింత విషయాలను వింటూ, అతడు ఆహారార్థం వేటకు వెళ్లినప్పుడల్లా తాముకూడా వెడుతూ గడిపారు. అరణ్యాలలోకి వేటకు వెళ్లినప్పుడు అనేక చిత్ర వృక్షాలు, జంతువులు, పక్షులు కనబడేవి. అప్పుడప్పుడు ప్రమాదభరితమైన సాహసాలు చేసేవారు.

ఒకరోజున సన్యాసి మామూలుకంటె పెందలకడనే తన మిత్రులను మేలుకొలిపాడు. త్వరగా సిద్ధం కావాలనీ, ఆరోజు చాలాదూరం వెళ్ళదలచుకున్నాననీ చెప్పాడు. మార్టిన్, బార్నీ త్వరత్వరగా ప్రాతర్భోజనం ముగించి బయలుదేరారు.

సన్యాసి జోడుగుళ్ళ తుపాకి తీసుకుని బుజాన వేసుకున్నాడు. మందుగొట్టం, తూటాలసంచీ మెడకు తగిలించుకున్నాడు. అతనిదగ్గిరనుంచి బార్నీ కొంతమందు, తీసుకుని తన పిస్తోలు నింపుకున్నాడు. వేటకు పనికివచ్చే పొడుగాటి ఖడ్గాన్ని సన్యాసి బార్నీకిచ్చాడు. అటువంటిదే చిన్నకత్తిని మార్టిన్‌కిచ్చాడు. మార్టిన్‌కు వేరే ఆయుధాలేమీ లేవు కనక విల్లు, బాణాలు ధరించాడు. వీటిని ఉపయోగించడం మార్టిన్ సన్యాసివద్దనే నేర్చుకున్నాడు.

ఈవిధంగా ఆయుధధారులై ముగ్గురూ బయలుదేరారు. సన్యాసి ఎప్పుడూ లేనిది ఒక బల్లెంకూడా తీసుకొచ్చాడు. ఇది దేనికని బార్నీ అడిగాడు.

“ఈరోజున పెద్దపులిని చూద్దామనుకుంటున్నాను. నిన్న ఒక పులి నా ఆవులు పెరిగే లోయలోకి పోవడం చూశాను. దాన్ని ఈరోజున సంహరించాలి. మార్టిన్! ఇవాళ నీకు నా ఆవుల్ని చూపిస్తాను,” అన్నాడు సన్యాసి.

దట్టమైన వృక్షజాలంతో నిండిన అరణ్యంలో ముగ్గురూ ఇంకా ముందుకు నడిచారు. ఎక్కడ చూసినా వివిధ వర్ణాలలో ప్రకాశించే చిలకలు కనపడ్డాయి. అవి ఒకటే గోల చేస్తున్నాయి. వాటి రొదతో అరణ్యమంతా మారుమోగిపోయింది. వాటి గోల తగ్గించాలని కాబోలు మార్టిన్ రాళ్ళు రువ్వాడు. గోల తగ్గడం బదులు ఎక్కువైంది. ఇక లాభం లేదని అతడు వాటిమానాన వాటిని వదిలేశాడు.

సూర్యుడు నడినెత్తికి వచ్చేవరకూ మన బాటసారులు నడిచారు. ఎండ మరీ తీవ్రంగా ఉంది. అందుచేత ఒక విశాలవృక్షంకింద విశ్రమించారు. అరణ్యంలో రొద క్రమంగా తగ్గిపోయింది. పశు పక్ష్యాదులు ఎండ వేడిమికి తాళలేక తమ తమ నివాసాలు చేరుకుని నిశ్శ

అనువాదం: నందూరి రామమోహనరావు

# మార్టిన్ రాట్లర్

ష్టంగా కూర్చున్నాయి. బాటసారులు తమతో తెచ్చుకున్న తినుబండారాలు ఆరగించి మళ్లీ నడిచారు.

ఇంతలో బార్నీ హఠాత్తుగా ఆగిపోయి "అదేమిటి?" అని అరిచాడు. పిస్తోలు తీసి గురి పెట్టాడు. మార్టిన్‌కూడా వింటికి బాణం సంధించాడు.

వారికొక పది అడుగుల దూరంలో భయంకరాకృతిగల ఒక తొండ ఉన్నది. మూడడుగుల పొడుగు ఉన్నది. తోక ఇంకా దీర్ఘంగా, బలంగా ఉన్నది. తల వికృతంగా ఉన్నది. మార్టిన్, బార్నీలు దానిమీదకి బాణం గాని, తుపాకిగుండు గాని వదలకముందే సన్యాసి తన తుపాకిని, ఈటెను కిందపడేసి, పరుగున పోయి తొండ తోకను పట్టుకుని, ఎత్తి గిరగిర తిప్పి నేలకేసి కొట్టాడు. తల పగిలి అది చచ్చింది. మార్టిన్, బార్నీ ఆశ్చర్యంతో చూశారు.

"ఇది ఏమంత పెద్ద తొండ కాదు. పెద్దవి ఆయిదడుగుల పొడుగు ఉంటాయి. కాని ఇవి నిరపాయకర జంతువులు. తోక ఒక్కటే వీటికున్న ఆయుధం. దాంతో కొట్టాయంటే ఇంకేం లేదు. అయితే నేను పట్టుకున్నట్టు గభాలున పట్టుకుంటే ఏం చెయ్యలేవు. అన్నిటికంటె ముఖ్యం ఏమిటంటే, ఈ తొండమాంసం కోడిమాంసం మాదిరిగా మహా రుచిగా ఉంటుంది," అంటూ ఆ తొండను ఇతర జంతువులేవీ తినడానికి వీల్లేకుండా దానిమీద పెద్దరాళ్లు వేసి కప్పిపెట్టాడు

"తోక పుచ్చుకుంటే ఏంచెయ్యలేదని మీరూ, బార్నీ అనుకుంటే అనుకోవచ్చు. కాని నేనైతే తోక పుచ్చుకుని మీలాగా గిరగిర తిప్పగలనా దాన్ని?" అన్నాడు మార్టిన్.

"నువ్వే కాదు, నేనూ తిప్పలేను," అన్నాడు బార్నీ.

"మరేం ఫరవాలేదు. ఒకటి, రెండేళ్లలో నువ్వు మాఅంత బలిష్ఠుడివౌతావు. అప్పుడు ఇలాంటి తొండల్ని రెంటినైనా తేలిగ్గా తిప్పగలవు" అని సన్యాసి మార్టిన్ బుజంమీద తట్టాడు.

ఇలా మాట్లాడుతూ వారు చీకటిగా, ఇరుకుగా ఉన్న కీకారణ్యంలోకి ప్రవేశించారు. పొదలను, తీగలను తప్పుకొనిపోవడం చాలా కష్టమైంది. అవన్నీ దాటుకొని కొంచెం తెరపిగా ఉన్న ప్రదేశంలోకి వచ్చారు. అక్కడ మహోన్నతమైన వృక్షసముదాయం కనబడింది.

"అవి చూశారా? అవే నా ఆవులు!" అన్నాడు కొన్ని వృక్షాలను చూపిస్తూ. పొడుగ్గా, నిటారుగా ఠీవిగా ఉన్నాయి ఆ వృక్షాలు "చాలా మంచి ఆవులు" అంటూ సన్యాసి కత్తితో మానుమీద గంటు పెట్టాడు. "వీటికి మేత వెయ్యనక్కరలేదు. పోషణ చెయ్యనక్కర్లేదు. అయినా పాపం ఎప్పుడు పడితే అప్పుడు పాలూ, మీగడా సమృద్ధిగా ఇస్తాయి."

గంటు పెట్టినచోట సన్యాసి ఒక కొబ్బరిచిప్పను పెట్టాడు. ఆ చిప్పలోకి చిక్కని, తెల్లని పాలు మెలిగా కారాయి. కొన్ని నిమిషా లాగి సన్యాసి ఆ చిప్పను తన మిత్రుల కిచ్చాడు. "ఇటువంటి మీగడ జన్మలో ఎప్పుడూ తినలే"దంటూ ఇరువురూ దాన్ని తిన్నారు.

బ్రెజిల్ దేశపు వృక్షాలన్నిటిలోకీ పాలచెట్టు అత్యద్భుతమైనది. దీని పండు చిన్న ఆపిల్ పండువలె ఉంటుంది. తినడానికి అతిరుచ్యంగా ఉంటుంది. దాని కలపకూడా దృఢంగా ఉండి, గట్టి పనిముట్లకు, సామాన్లకు పనికివచ్చేదిగా ఉంటుంది. ఈ వింతచెట్టు విశేషాలన్నిటికీ తలమానికమైనది అందులోంచి వచ్చే పాలు. బెరడుమీద కత్తితో కొట్టగానే చిక్కని పాలు స్రవిస్తాయి రుచికి అచ్చగా ఆవుపాలవలెనే ఉంటాయి. వాసన మాత్రం అదోమాదిరిగా ఉంటుంది. అయినా అది మంచి వాసనే కాని చెడువాసన కాదు. టీలోగాని, కాఫీలోగాని ఈ పాలు వాడుకోవచ్చు. అయితే మరీ చిక్కని పాలు కావడంవల్ల కొంచెం నీళ్లు కలిపి వాడుకోవాలి. ఈ పాలను గాలిలో ఉంచితే త్వరగా గట్టిపడిపోతాయి. అలా గట్టిపడినప్పుడు దాన్ని జిగురుగా వాడుకోవచ్చు.

మన పాంథులు కావలసినన్ని పాలు త్రాగి, సేదదీరి మళ్లా ప్రయాణం సాగించారు. కొంతసేపట్లో ఒక పర్వతశ్రేణిని సమీపించారు. సన్యాసి తుపాకిని తీసి చేత్తో పట్టుకుని ఒక కొండపైకి దారితీశాడు. ఆ

కొండకు ఒక చివర కొన్ని గుహ లున్నాయి. గుహ ద్వారాలవద్ద లతలు, పొదలు పెరిగి దారి నిరోధిస్తు న్నాయి.

ఈటె మొనను వాడిగా ఉన్నదో లేదో పరీక్షిస్తూ, సన్యాసి ఇలా అన్నాడు: "ఇప్పుడు మనం జాగ్రత్తగా ఉండాలి. ఈ గుహల్లో ఎక్కడో ఒక పెద్ద పులి ఉండాలి. నిన్న చూశాను. ఉందో మరి, వెళ్లి పోయిందో."

తుపాకిని ఒక రాతికి ఆన్చి బల్లెం ఎడమ చేత్తో పట్టుకుని, ఒక గుహలోకి రాయి విసిరేశాడు. రాయి గుహలోపలి గోడలకి కొట్టుకుని ఖంగున మ్రోగింది.

"ఇంకా ఇక్కడుంటుందా పెద్దపులి? ఎప్పుడో పోయిఉంటుంది," అన్నాడు బార్నీ.

"ఉష్. మాట్లాడకు. తక్కిన గుహలు కూడా చూడనీ" అని మందలించాడు మార్టిన్.

ఈ మాటలు వినకుండానే సన్యాసి మిగతా గుహల్లోకి కూడా రాళ్ళు విసిరేశాడు. కాని పెద్దపులి జాడ తెలియలేదు.

"ఆ మొదటి గుహలో ఉందేమో పులి," అని బార్నీ అటువైపు వెళ్లాడు. "అరె. ఏమిటది. ఇటు రండి. ఇది వజ్రాల గనిలాగా ఉంది. ఈ గుహలో చూడండి, రెండు వజ్రాలు మెరుస్తున్నాయి——"

బార్నీ చెప్పేది పూర్తికాకముందే దూరాన ఎక్కడో ఉరిమినట్టు ధ్వని వచ్చింది. అతన్ని బలంగా వెనక్కి లాగివేసి, సన్యాసి తను ఆ గుహముందు సుస్థిరుడై నిలబడి, బల్లెం సిద్ధంగా పట్టుకున్నాడు.

"మార్టిన్! ఆ గుహలోకి ఒక బాణం వెయ్యి," అని నెమ్మదిగా అన్నాడు.

మార్టిన్ బాణం వేశాడు. తక్షణమే అందులోంచి మహాభీకరమయిన గర్జన వినబడింది. ఆ గర్జనకి చుట్టుపక్కల చెట్టుచేమలు కదలాడాయి. కాని సన్యాసి ఆవంతైనా భయపడలేదు. శిలాప్రతిమలాగా దృఢంగా, రొమ్ము ముందుకు విరిచి, ఒక కాలు ముందుకు పెట్టి నుంచున్నాడు.

మొదటిగర్జన ఆగిన క్షణమే మళ్ళీ గర్జారంభ పదింతలుగా వినబడింది. గుహలోంచి ఒక పెద్ద వ్యాఘ్రం పరుగెత్తుకు వచ్చి సన్యాసిమీదికి లంఘించింది. సన్యాసి కనురెప్పయినా మూయలేదు. ఒక పెండ్రుకవాసి ముందుకు వంగాడు. బల్లెం ఝుయ్యిన పోయి వ్యాఘ్రం రొమ్మును దూసుకుపోయి చీల్చుకుని అవతలవైపున బయటికి వచ్చింది. కాని పులి వేగాన్ని అడ్డగలిగినంత బలం కలది కాకపోవడంచేత బల్లెం విరిగిపోయింది. పులి సన్యాసిమీద పడింది.

ఆ గందరగోళంలో బార్నీ గబాలున పిస్తోలు తీసి పులిమీదికి పేల్చాడు. అదృష్టవశాత్తు పిస్తోలులో గుళ్లు పెట్టడం మరిచిపోయాడు బార్నీ. లేకపోతే ఆ దెబ్బ పులికి బదులు సన్యాసికి తగిలి అతడు మరణించేవాడు. ఈలోగా మార్టిన్ సన్యాసి ఇందాక రాతికి ఆన్చిన తుపాకి తీసుకుని పులి చెవిలో పెట్టి ఢామ్మని పేల్చాడు. పులి చచ్చిపడింది. ఇదంతా కొన్ని సెకన్లలో జరిగింది. సన్యాసి వళ్ళు దులుపుకుని లేచాడు. అతనికి దెబ్బలేమీ తగలలేదు.

"ఎంత ధైర్యమయ్యా నీది? అంత లావు పెద్ద పులి మీదికొస్తుంటే కాలు కదపనైనా కదపకుండా నుంచున్నావు!" అని బార్నీ అభినందించాడు.

"మీకు దెబ్బ తగిలినట్లుంది. మీ మొహం నిండా ఆ నెత్తురేమిటి?" అని మార్టిన్ ఆందోళన పడ్డాడు.

"ఇది నా నెత్తురు కాదు. పులిది," అంటూ సన్యాసి దగ్గిర్లోఉన్న ఒక ఏటి నీటిలో ముఖం, వళ్ళు కడుక్కున్నాడు. తరవాత పులి చర్మం వలిచి తీసుకుని కళేబరం అక్కడే వదిలేశాడు.

అప్పటికి సాయంత్రమైంది. అందుచేత పులి చర్మం తీసుకుని ముగ్గురూ తిరుగుముఖం పట్టారు. దోవలో ఇందాక చంపిన తొండను తీసుకున్నారు. చీకటిపడే వేళకు కుటీరం చేరుకున్నారు.

(ఇంకా వుంది)

# చిన్నప్పటి నేస్తాలు

- ము. వీరభద్ర శాస్త్రి

చల్లటి గాలి - తెరలు తెరలుగా వీస్తున్నది. సాయంకాలపు నీరెండ పడి పచ్చటి గడ్డి కంటికి చాలా ఇంపుగా కనిపిస్తున్నది. పార్కులో సిమెంటు బెంచిమీద కూర్చొని ఉన్నాను. నా వెనకనే ఎత్తుగా క్రోటన్సు మొక్కలు పెరిగి ఉన్నాయి ఆ మొక్కలకు అవతలప్రక్క చిన్నపిల్లలు హుషారుగా కేకలు పెడుతూ ఆడుకుంటున్నారు. 'దూరంగా రేడియో సంగీతం పాడుతున్నది.

చీకు, చింత లేని పిల్లలు- అమ్మ, నాన్న, అన్నయ్యలు, అక్కయ్యలు ముద్దు చేసే పిల్లలు - ముద్దు ముద్దుగా ముచ్చటగా ఆడుకుంటున్నారు.

"నేను రాజకుమారుణ్ణి. నీవు మంత్రగాడివి" అంటున్నాడొక అబ్బాయి.

నా చిన్నప్పుడు, నేనూ రాజకుమారుణ్ణి అనుకొనే రోజులలో, నేనూ ఇటువంటి కథలు విన్నాను. ఇటువంటి ఆటలు ఇలాగే - ఆడుకున్నాను. అవన్నీ గురుతు వస్తుంటే ఏదో చెప్పరాని ఆనందంతో నా కళ్లు చెమర్చినాయి.

నెయ్యి ఎక్కువగా వేసి, ముద్దలు కలిపి చేతిలో పెడుతూ మా అమ్మమ్మ కథలు చెప్పేది. ఆ కథ వినకపోతే, అన్నం నయించేది కాదు. నోట్లో ఉన్న ముద్ద నమలాలో, చెప్తున్న కథకు ఊకొట్టాలో తెలియక, ఆలోచన చేమలక, ఉక్కిరి బిక్కిరి అయ్యేవాణ్ణి ఆ కథలోని రాజకుమారులలాగా ఎన్నెన్నో అనుకున్న విషయాలు సాధించాలని, అలాంటివి నిజంగా జరిగితే ఎంత బాగుంటుందో అని ఆశలు, ఊహాలు చేసేవాణ్ణి. ఇప్పుడు గుర్తుకువస్తుంటే నవ్వు వస్తున్నది.

ఆ కథలు జరిగిన కాలంలో నేనూ ఉండిఉంటే—నేను సాహసాల్ను చెయ్యకపోయినా, చేసిన ఆ రాజకుమారుల ప్రక్కన తిరుగుతూ ఉంటే - ఎంత బాగా ఉంటుంది?

అవన్నీ ఆలోచించినకొద్దీ వళ్లు ఎంచేతో మైకం కమ్ముతున్నది. మనస్సు తేలిపోతున్నది - రెక్కలు విప్పుకొని స్వేచ్ఛగా ఎత్తయిన ఆకాశంలో విహరించే పావురంలాగా ఎగిరిపోతున్నది. చిత్రవిచిత్రములయిన వాద్యధ్వనులు సన్నగా వినిపిస్తున్నాయి.

ఏదో ఒక పట్టణం. ఆ పట్టణంలో ఒక యిల్లు. ఆ యిల్లు పూరి గుడిసేనో, పెంకుటిల్లో తెలియటం

లేను ఆ యింటిముంగిటికి వెళ్లాను ఒక ముసలమ్మ కనిపించింది.

"ఏ ఊరు నాయనా మనది?" అని అడిగింది

నాకు నోటి వెంట మాట రాలేదు. కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డాను.

"ఏ ఊరయితే ఏంలే నాయినా! చాలా అలిసి పోయినట్లున్నావు. లోపలికి రా! అన్నం తిందువుగాని" అన్నది.

ఆ మాటలలో ఏమి శక్తి ఉన్నదో గాని, నేను అవునని గాని కాదని గాని అనలేకపోయినాను. నాకు వేరే ఏ ఆలోచనా తట్టలేదు. మాట్లాడకుండా ఆమె వెంట లోపలికి వెళ్ళాను

నాటకంలో వేషంలాగా ఖరీదైన పట్టుగుడ్డలు తొడుక్కొని, ఆభరణాలు పెట్టుకొని ఉన్న ఒక బాలకుమారుడు పదహారేండ్లవాడు కనిపించాడు. ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు తూనీగలా తేలిపోతున్నాడు

"అమ్మలాగ ఆదరించి అన్నం పెట్టావు. ఈ వరహా తీసుకో!" అంటూ, ఆమె చేతికిచ్చాడు.

నేనెప్పుడూ వరహా చూడలేదు ఎట్లా ఉంటుందో చూడాలని చిన్నప్పుడు చాలా కోరికగా ఉండేది. మా అమ్మమ్మని రెండు మూడు సార్లు అడిగాను. కాని ఆమె చెప్పలేదు. ఇప్పుడయినా చూద్దామని పించింది కాని అది కనిపించలేదు. అది తీసుకొని రొండిన పెట్టుకొని, ఆమె "మా నాయినే!" అంటూ అతని చెక్కిలి నిమిరి మెటికలు విరుచుకున్నది.



కుమారి ఆవలూరి శాంత (11 సం)
(ఎమ్. ఎస్. శైవగారి శిష్యురాలు మదరాసు ఆంధ్ర బాలానంద సంఘంలో భరతనాట్య పోటీలలో బహుమతి పొందినది)

## ★ చిన్నప్పటి నేస్తాలు ★

"అయితే, పెద్దమ్మా! ఏమిటి ఊళ్లో విశేషాలు?" అని అడిగాడు ఆ అబ్బాయి. నేను ఆశ్చర్యంగా ఆమెవంక చూశాను. ఆమె అతనితో చెప్తున్నది.

"విశేషాల కేమిటి నాయనా! చాలా ఉన్నాయి. ఇక్కడికి నూరామడ దూరంలో ఒక పట్టణం ఉన్నది. ఆ పట్టణానికి రోజూ రాత్రి పూట ఎక్కడినుంచో ఒక పులి వచ్చి అందరినీ భక్షిస్తున్నది. పట్టణంలో వాళ్లు నిద్రాహారాలు మానేశారు. ఆ పులిని చంపిన వాళ్లకి కూతురి నిచ్చి పెళ్ళి చేసి అర్ధ సింహాసనము ఇస్తానని ఆ పట్టణమేలే రాజు చాటింపు చేయించాడుట. అదే విశేషం."

"సరేలే పెద్దమ్మా! నేను పోయి వస్తా," నంటూ ఆ అబ్బాయి మాయమైనాడు. నే నక్కడ ఉన్నమాటైనా గమనించలే దతడు.

"ఆ అబ్బాయి ఎవరు పెద్దమ్మా?" అని అడిగాను.

"ఏమో నాయనా!"



చెమ్మచెక్క చేరడేసిమొగ్గ

అంక రామకృష్ణ (14 సం॥)—రాజమండ్రి.

"ఎక్కడికి వెళ్ళాడిప్పుడు?"

"ఆ పులిని కొట్టి పులిరాజు కూతురిని పెళ్ళాడటానికి పోయిఉంటాడు."

"నూరామడ దూరంపోయి, ఆ పులిని కొట్టాడా?"

పెద్దమ్మ నవ్వింది. "మా యింటికి రోజూ ఎంతెంతమందో అబ్బాయిలు వస్తూపోతూ ఉంటారు. ఎంత చురుకైనవాళ్ళని? ఆ ఎదురుగా ఒక పెద్ద మేడ ఉన్నది చూడు. ఆ ఇంట్లో అబ్బాయి..."

చూశాను. ఎదురుగా ఒక బంగారు మేడ కనిపించింది. అంతకు ముందు దాన్ని నేను చూడనే లేదు.

"...ఇక్కడికి దక్షిణంగా అరవై ఆమడదూరంలోఉన్న బ్రహ్మరాక్షసిని చంపి, ఒక రాజకుమార్తెని చెరవిడిపించుకొని వచ్చి పెళ్ళి చేసుకోలేదూ?"

ఇలాగే ఇంకెంతమంది? మా యింట్లోఉండి మా ఆవులు మళ్లేస్తూ ఉండే అబ్బాయి దేవకన్యను, నాగకన్యను, వరుణ కన్యను, అగ్ని కన్యను పెళ్ళిచేసుకొని హాయిగా హంసతూలికా తల్పముపైన శయనించి సేవ చేయించుకుంటున్నాడు. అడుగో ఆవీధిలోఉన్న అబ్బాయి వెంట్రుకమీదిగా కోటగోడ ఎక్కి, అలా చేసిన వాడినిగాని పెళ్లి చేసుకోనని భీష్మించుకు కూర్చున్న రాజుగారమ్మాయిని చక్కా పెళ్లి చేసుకున్నాడు."

"అవునవును పెద్దమ్మా! ఇవన్నీ కథలలో విన్నాను చిన్నప్పుడు."

"అవునులే మీరంతా చిన్నప్పుడు వినేఉంటారు. ఆ కథల్లోవాళ్ళందరిని నే నెరుగుదును నాయనా! అంతా ఇక్కడే ఉన్నారు. ఈ వీధి వీధిఅంతా రాజులే ఉన్నారు. ప్రతి రాజుకూ ఒక్కడే కొడుకు. అదీ లేక లేక పుట్టినవాడు. పదహారేళ్లు వచ్చేసరికి అన్ని విద్యలూ నేర్చినవారు. రకరకాల సాహసాలు చేసినవారు."

"మరి ఒక కథలో 'అనగా అనగా ఒకరాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు.' అని చెప్తుంటారే. ఆ రాజో?"

"ఆ రాజూ ఉన్నాడు. ఆ ప్రక్క వీధిలోనే ఆ రాజు ఇల్లు. ఆ ఇంటి పక్కనే ఇంకోరాజు. ఆ రాజుకూ ఏడుగురు కొడుకులే."

"ఏడు మల్లెపూల ఎత్తు రాజకుమార్తెలు ?"

"వాళ్ళూ ఉన్నారు. హాయిగా వాళ్ళందరూ పెళ్ళిళ్లు చేసుకొని మొగుళ్ళతో హాయిగా కాపురాలు చేస్తున్నారు. నాకు బాగా గుర్తుంది. ఒక రాజకుమారుడే - కీలుగుఱ్ఱం ఎక్కి తిరుగుతుండే వాడు.

# ★ చిన్నప్పటి నేస్తాలు ★

ఆ అబ్బాయి ఒక అమ్మాయిని చేసుకున్నాడు. ఇంకొక అబ్బాయేమో కంచురథం ఎక్కి వచ్చాడు. అతడింకో అమ్మాయిని చేసుకున్నాడు. ఆ ఏడు మల్లెపూల ఎత్తు పిల్లలంతా అవతల పేటలో ఉన్నారు. గుర్తు చెప్తాను విను. నీవు ఏ దారివెంట వచ్చావు ముందు చెప్పు."

"తెలియదవ్వా! ఎలా వచ్చానో ఏమో ఇక్కడికి."

"బాగుంది. నీవు వచ్చిన దారే నీకు తెలియదంటావా?" అంటూ పెద్దమ్మ బోసినోటితో నవ్వింది.

"నిజంగానే అవ్వా! వీళ్లందరిని గురించి నేను విన్నాను. అయితే వాళ్ళని ఎప్పుడూ చూడలేదు. రాత్రిపూట ఏదయినా ఆలోచిస్తూ పడుకొని నిద్దరపోతే అవే కలలోకి వస్తాయని అనుకుంటుంటే విన్నాను. ఎన్నిసార్లో ఆలోచించుకుంటూ పడుకున్నాను గాని ఎప్పుడూ కలలు రాలేదు."

అవ్వ మళ్ళీ నవ్వింది.

"పోని ఇప్పుడు నిజంగా చూడ వస్తువుగా! అటు చూడు ఒక దారి ఉన్నది. ఆ దారివెంట పోయి కుడిచేతి ప్రక్కకి తిరుగు అక్కడ..."

దారికోసం చూశాను. మసక మసకగా కన్పించింది. నీటిలో నీడ చూస్తూఉండగా, గాలికి నీరు కదల బారి, నీడ కదిలిపోయినట్లు దారి మాయమైంది.

"అవ్వా! ఇదేమిటి నాకు కనిపించటంలేదు" అంటూ కళ్లునులుము కొని చూశాను. అటు దారి మాయమైనట్లే ఇటు పెద్దమ్మ మాయమైంది. అవ్వ నవ్విన బోసి నవ్వొక్కటే తెల్ల తెల్లగా మెరుస్తూ కనుమాసిపోయింది.

ఈవాళయినా వారందరినీ చూడ గల్గుతున్నానన్న ప్రస్తుతపు ఆశ అడుగంటిపోయింది. ఎప్పటికయినా చూస్తే బాగుండునన్న చిన్ననాటి ఆశ రెట్టింపు అయింది.

ఆ కథలలో వాళ్ళందరూ ఒక్క చోటే ఉన్నారు. ఒకే పట్టణంలో ఉన్నారు. ఒక్కొక్క రకంవాళ్లు ఒక్కొక్క వీధిలో-వాళ్ళనుగురించి నేను నా చిన్నప్పుడు విన్నాను. మా నాన్న ఆయన చిన్నప్పుడు వినిఉంటారు. మా తాతయ్యకూడా వినిఉండవచ్చు. మరి ఇంత పూర్వ కాలంవాళ్ళయిన ఆ కథలోనివాళ్లు ఇప్పుడు ఎట్లా ఉన్నారో కదా! వాళ్లు ముసలివాళ్ళయి ఉంటారా? అబ్బే! అయిఉండరు.

వాళ్లంతా ఎంత మంచివాళ్లు. నా చిన్నప్పటి నేస్తాలు. నా ఒక్కడి కేమిటి? అందరికి - అందరు చిన్న పిల్లలకి నేస్తాలే! ఒక్కొక్కరిని తలుచుకుంటే కళ్ళముందు కనిపిస్తు న్నట్లు అనిపిస్తున్నది. మట్టితో ఎండు ఉండ, పచ్చి ఉండలు చేసి, నీలాటిరేవున చేరి అమ్మలక్కల కుండలు పగల గొట్టుతూ, అతికిస్తూ ఉండిన రాజ కుమారులిద్దరు - చింతకాయ పచ్చడి అన్నం, పెరుగన్నం వెంట తీసుకొనిపోయి, అడవుల వెంట ప్రయాణంచేసి, పులి తీసుకొని పోయిన చెల్లెలిని విడిపించుకొని



# పిచ్చుకమ్మ సంకెళ్లు



— కోకా సీతారామారావు (8)

ఒక ఊరిలో ఒక రైతు వుండే వాడు. అతనికి కొద్దిగా పొల ముండేది. అతనిపై శనిదేవతకి అకారణంగా ఆగ్రహం కలిగింది. వానాకాలం రాగానే రైతులంతా పొలం దున్ని గింజలుజల్లారు. మన రైతు రామయ్యగూడా అందరి లాగా తనకున్న కాస్త పొలందున్ని జొన్నలు చల్లాడు.

శనిదేవుడు వానలనిచ్చే కార్తె లన్నిటినీ పిలిచి, రామయ్య పొలం మీద ఒక చుక్కయినా కురవ కూడదని ఆజ్ఞాపించాడు. చిత్తకార్తె వాన చిటపట చినుకులేగదా, దాని కేమిటి చెప్పేది అని దాన్నిమాత్రం పిలవలేదు. అన్ని కార్తెలు రామయ్య పొలం తప్పించి అన్ని పొలాలమీద కురిసిపోయాయి. రామయ్య పొలం మాత్రం వాన లేక బీడుపడింది. ఇంతలో చిత్త కార్తె వచ్చింది. అది ఈ పొలం చూచి దీన్ని నావంతుకు తలిమా కార్తులు వదిలాయి గాబోలని తన వానంతా అక్కడే గుమ్మరించింది. ఈ వానధాటికి పొలం బాగా తడిసి చక్కగా మొలకెత్తి మంచి పైరయింది. ఇది శనిదేవుడికి తెలి యదు.

రామయ్య యిక్కడైనా తనను ప్రార్థిస్తాడేమోనని చూడ్డానికి శనిదేవుడు బయలుదేరాడు. తీరా చూస్తే రామయ్య పొలం అందరి పొలాలకంటె ఏపుగా ఎదిగి బరువైన కంకులు వంగి వున్నాయి. శనిదేవుడు ఆశ్చర్యపోయాడు. సరే జరిగిందేదో జరిగిపోయింది, ఈ కుప్పకు కుంచెడే రావాలని శపించి పోయాడు. ఈ సంగతి అక్కడే కంకులమీద కూర్చున్న ఒక బుల్లి పిచ్చుక విన్నది.

పాపం! రామయ్య పాడైపో తాడే, కుప్పవేయకుండా చూడా లని తలచి, మెల్లిగా రామయ్య దగ్గరకు చేరి, "ఓ రామయ్యా! నీవు చేసుకోని కుప్పవేస్తే, కుంచెడే రాలాలని శనిదేవుడు శపించాడు. కాబట్టి ఏమి చేస్తావో మరి" అని చెప్పి ఎగిరిపోయింది

ఇది విని రామయ్య కుప్పకు కుంచె డన్నాడుగదా, మొక్క మొక్కను కుప్పవేసి రాలుద్దా మని మొక్క మొక్క రాల్చాడు. కుప్పలా మొక్కలు కట్టాడు గాబట్టి, మొక్క మొక్కకు కుంచెడు గింజలు రాలాయి. దాంతో చేనం తటికి బండ్లతో గింజలయ్యాయి. బండ్లమీద బస్తాలు బయలుదే రాయి. మళ్ళీ శనిదేవుడు చూడ్డానికి వచ్చాడు. బండ్లతో బస్తాలు పోతున్నారు. దివ్యదృష్టితో చూచి పిచ్చుక చేసిన పని గ్రహిం చాడు. "ఛీ! పాడు పిచ్చికా! నా పనికి నీవు అడ్డమొచ్చావు! నీవు నడవలేకుండా నీ కాళ్ళకు సంకెళ్ళు పడాల"ని శపించిపోయాడు. అప్పటి నుండి పిచ్చుక గెంతుటేగాని నడవ లేదట. అదిపోయి రామయ్యతో చెప్పకొని ఏడ్చిందట. "పాపిలే! బుల్లి పిచ్చికా! నిన్ను నేను

---

వచ్చిన రాజకుమారులు, ఇవన్నీ ఆలోచిస్తుంటే నవ్వొస్తున్నది, దుఃఖం వస్తున్నది.

గాలిలో చుట్టూ అలికిడి అయి నట్లు అనిపిస్తున్నది. కథలలోనివా ంతా నాకు కనిపించకుండానే నా చుట్టూ నిలబడి నన్ను చూస్తు న్నట్లు తోస్తున్నది.

నాకు సిగ్గనిపించింది. తలవంచు కున్నాను. క్రమంగా నా మనస్సు బరువెక్కింది. మైకం విడిపోయింది. గాలి వంటికి తగిలింది. రేడియో సంగీతం చెవులలో పడింది.

ఈసారి నీవే మంత్రగాడివి. నేను రాజ కుమారుణ్ణి" అంటున్నాడు క్రోటన్సు వరుస వెనుకనుండి ఒక అబ్బాయి. ★

# బాలవాఙ్మయనిర్మాతలు

(42 వ పేజీ తరువాయి)

కూనుప గాథలవల్ల అతనిపేరు బాల వాఙ్మయములో చిరస్థాయిగా నిలచి పోయింది

గ్రిమ్ సోదరులు జర్మనీ దేశస్థులు. జేకబ్ కార్ల్ గ్రిమ్ 1785 లో జన్మించాడు. విల్ హెల్మ్ గ్రిమ్ 1786 లో జన్మించాడు. గ్రిమ్ సోదరులు భాషాశాస్త్రజ్ఞులు, వైయాకరణులు. జేకబ్ గ్రిమ్ గురువు సహితుడుగా పరిశోధన సలుపుతున్న కాలములో అతనికి జర్మనీ సాహిత్యముపై అభిరుచి కలిగింది. ఆకాలములో ఒక జర్మనీ దేశస్థునిచే సేకరింపబడి, పరిష్కృతము చేయబడి, అచ్చయిన జానపద గేయసంపుటి జేకబ్ గ్రిమ్ను ఆకర్షించింది. దానితో అతడు పరిశోధన చేయటానికి వచ్చిన విషయములతోపాటు, జానపద గాథలలో పరిశోధన జరిపే అవకాశము లభించింది. అతను అక్కడ ఉండగా అతడి సోదరుడు 'అముద్రిత గ్రంథాలలో జర్మన్ దేశపు పాతపాటలను సేకరించటానికి వీలవుతుందా?' అని జాబు వ్రాశాడు. జేకబ్ గ్రిమ్ చేసిన పరిశోధన గేయాలలో కాకపోయినా జానపద గాథలలో జరిగింది. స్వస్థానము చేరుకొన్న తరువాత సోదరుని సహాయముతో ఈ కార్యము నెరవేర్చటానికి జేకబ్ నిశ్చయించుకొన్నాడు. అనంతరం సోదరులిద్దరు గ్రామ గ్రామమూ తిరిగి గాథలను సేకరించారు. గ్రిమ్ సోదరులకు ఆ గేయాలను యథాతథముగా ఉంచవలెనని అభిప్రాయము. తమ సమకాలికులవలె వాటిని మార్పుచేయటము వారికి రుచించలేదు. హౌస్ మార్చెన్ (పిల్లల పాటలు) జర్మనీ భాషలో వ్రాయబడినది. 1812 నుండీ ఆ దేశపు దైనిక జీవితములో ఒక భాగమైపోయినది. అనంతరము అది ఆంగ్ల భాషలోకి అనువాదము చేయబడినది. గ్రిమ్స్ కథలు 1823లో 'జర్మన్ పాపులరు స్టోరీస్' అను పేరున ఆంగ్ల భాషలో అనువదింపబడి సచిత్రముగా ప్రచురింపబడినవి. ఆనాటినుండీ ఆంగ్ల బాల బాలికలలో ఈకథలను చదివి ఆనందించనివారులేరు. పెద్దవారి సహాయములేకుండా వాటిని చదివి ఆనందించగలుగుతున్నారు. శాస్త్రపరిశోధన చేయ సమకట్టిన జేకబ్ గ్రిమ్కు, నవలలు నాటకాలు వ్రాసి నటుడిగా జీవితము గడపదలచిన ఏండర్సన్కూ బాలవాఙ్మయములో నిర్మాతలుగా ప్రఖ్యాతి కలగటము విచిత్ర సంఘటనలు.

అనుశ్రుతముగా వచ్చిన జానపద గాథలను సేకరించి ఆ పలుకుబడిలోనే ఆ విధానములోనే గ్రంథస్థముచేయ తలపెట్టిన గ్రిమ్సోదరులు జంటగా ఏవిధమైన భేదమూ లేకుండా జీవించారు. విద్యార్థిదశలో వారిద్దరూ ఒకచోట తిని, ఒకచోట పడుకున్నారు. ఒక గదిలో ఒక బల్లముందర చదువుకొన్నారు. ఇద్దరూ సమష్టిగా ఒకగదిలో జీవించారు. తరువాత విల్ హెల్మ్ గ్రిమ్ ఆనందమయ వైవాహిక జీవితము ఆసోదరుల సన్నిహితత్వానికి భంగము కలిగించలేదు. సోదరులిద్దరూ ప్రొఫెసర్లయినారు. 1863-లో జేకబ్ గ్రిమ్ మరణించాడు. 1859-లో విల్ హెల్మ్ కార్ల్ గ్రిమ్ మరణించాడు. అంతవరకూ సోదరులిద్దరూ జంటగా జీవించి, జంటగా గ్రంథరచన చేశారు.

బాలవాఙ్మయ నిర్మాతలలో ఈ ముగ్గురు రచయితలు ప్రముఖస్థానము కలవారు. విశ్వసాహిత్యములో ఉత్తమగ్రంథ నిర్ణయము నిష్పక్షపాతులైన సాహిత్యవేత్తలు విద్యావేత్తలచే చేయబడినది. మూడువేల సంవత్సరాల కాలపు సాహిత్యములో, 3 వేల ఉత్తమ గ్రంథాలను మణిదీపాలవంటి వాటిని నిర్ణయించారు. వాటిలో ఆల్కాట్ లూయిసమేరి రచించిన 'లిటిల్ విమెన్', ఏండర్సన్ కథలు, 'అరేబియన్ నైట్సు', లూయిస్ కారల్ రచించిన 'ఏలిస్ ఇన్‌ది వండర్ లాండ్' మార్క్ ట్వైన్ రచించిన 'హాక్లిబరీఫిన్', 'ప్రిన్సు అండ్ ది పాపరు', 'టామ్‌సాయర్', గ్రిమ్‌సోదరుల కథలు, ఆర్ ఎల్ స్టీవెన్‌సన్ రచించిన, 'ట్రెజర్ ఐలెండు' జానపదగేయాలు, గాథలు, గలివర్సు ట్రావెల్సు, ఈసప్‌కథలు మొదలైనవి ఉన్నవి.

వీటిలో చాలావరకూ తెలుగుభాషలోకి అనువదింపబడి, తెలుగుబిడ్డలకు పరిచయము చేయబడుతున్నవి. ఈ కృషికి ఇతోధికముగా సేవచేస్తున్న తెలుగు రచయితలను, తెలుగుపత్రికలను తెలుగుతల్లులు ప్రశంసించకుండా ఉండలేరు. ★



గతమాసం భీమవరంలో 'వెన్నెల' కావ్యావిష్కరణసమయంలో తీసిన ఛాయాచిత్రం. వేదికపై ఆసీనులైనవారు కవి శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తి, సభాధ్యక్షులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామి, 'వెన్నెల' గానం చేసిన శ్రీమతి భావరాజు సీతామహాలక్ష్మిగార్లు

## పిచ్చుకమ్మ సంకెళ్లు

కాపాడుతానని కొన్ని కంకులు కుచ్చుగట్టి పంచలో వేలాడదీశాడు. అప్పటినుండి ప్రతి రైతు కుప్పవేసి గింజలు రాల్చగానే పిచ్చుకలకని కుచ్చుగట్టి యిళ్లల్లో వేలాడేయడం అలవాటైపోయింది. ★

Printed and Published for Nageswara Rao Estates Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1 Editor S Sambhu Prasad.

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

# సంక్రాంతి సంచిక

# కథానికల పోటీ

**మొదటి బహుమతి రు. 75  రెండవ బహుమతి రు. 50.**

## రచనలు చేరవలసిన ఆఖరుతేది 10-12-55

ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రిక 1956 సంక్రాంతి ప్రత్యేక సంచిక ప్రచురణ పురస్కరించుకుని కథానికా రచనకు ప్రోత్సాహమివ్వవలెననే ఉద్దేశంతో పోటీ జరపాలని నిశ్చయించాము.

పోటీకి వచ్చే కథానికలలో శ్రేష్ఠమైన రెండు రచనలకు రు. 75, రు. 50 బహుమతులివ్వబడతాయి.

సామాజిక ఇతివృత్తాలుగల స్వతంత్ర రచనలే పోటీకి స్వీకరించబడతాయి.

పోటీ కధానికలు మా కార్యాలయానికి 1955 డిసెంబరు 10 వ తేదీలోగా చేరాలి.

బహుమతుల గురించిన తుది నిర్ణయాధికారం సంపాదకులకే ఉంటుంది.

పోటీకి పంపే కథానికలకు రేపర్లపైనా, రచన మొదటి పుట పైనకూడా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంక్రాంతి కథానికల పోటీకి" అని వ్రాయాలి.

రచనలు తెల్ల కాగితాలలో సిరాతో ఒకే వైపున వ్రాసి పంపాలి.

బహుమతి నిర్ణయం అనంతరం ప్రచురణకు స్వీకరించబడని రచనలను త్రిప్పి పంపగోరే రచయితలు తమ రచనలతో పాటే తిరుగు పోస్టుకు అవసరమైన స్టాంపులు జతపరిచి పంపాలి.

సంక్రాంతి సంచికకు గాను ఇతర వ్యాసాలు, కథానికలు, చిత్రాలు, ఫొటోలు పంపదలచిన వారు కూడా 1955 డిసెంబరు 10 వ తేదీలోగా మా కార్యాలయానికి అందేటట్లు పంపాలి. చిత్రాలు ఇండియన్ ఇంక్‌లో వ్రాయాలి. ఫొటోలు గ్లాసీ ప్రింట్సు మాత్రమే; కార్డు సైజుకి తక్కువ కాకుండా ఉండాలి.

రచయితలు ఈ సదవకాశాన్ని వినియోగించుకుని మా సంకల్పాన్ని జయప్రదంగా నెరవేర్చగలరని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు.

ప్రఖ్యాతమైన వస్త్రములకు ఒక నూతన నామధేయం

# Calicloth

కేలిక్లాత్ స్త్రీలకొరకు

